# మహిషాసురమర్దినీ స్తోత్ర వివరణము



వివరణకర్త

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి**, M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు

టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు




జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

**(The World Teacher Trust - Guntur Branch)**

గుంటూరు - 522 002

ఫోన్ :233995

Mahishasura Mardini Stotra Vivaranamu
by Dr.G.L.N. SASTRY

# మహిషాసుర మర్దినీ స్తోత్ర వివరణము

ప్రథమ ముద్రణ ఆగష్టు 2002



ప్రతులకు

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   H/o. డా॥ జి. ఎల్.ఎన్.శాస్త్రి
   5-10-4, 2/9, బ్రాడీపేట
   గుంటూరు -522 002
   ఫోన్ నెం.(0863) 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   45-40-36/G1, అక్కయ్య పాలెం
   విశాఖపట్టణము - 530 016
   ఫోన్ నెం (0891) 565291

**వెల : రూ.30/-**

డి.టి.పి. : క్రియేషన్ గ్రాఫిక్స్,
2/11, బ్రాడీపేట, గుంటూరు-2 ఫోన్ :250885

ముద్రణ : విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,
గుంటూరు -2, ఫోన్ : 242345



# విషయ సూచిక

విషయము | పుట సంఖ్య

| విషయము | పుట సంఖ్య |
| --- | --- |

# ప్రత్యేక కృతజ్ఞతలు

## (ప్రథమ ముద్రణ)

ఆదిశంకర భగవత్పాద విరచిత 'మహిషాసురమర్దినీ స్తోత్రా'నికి వివరణ గల ఈ పుస్తకం లక్ష ప్రతులను ముద్రించి, పాఠక భక్తులకు అందజేయాలనే సత్సంకల్పాన్ని పురస్కరించుకొని - ప్రపథమంగా 1000 ప్రతుల ముద్రణకు

## ప్రొఫెసర్ శ్రీ వంగపల్లి విశ్వనాథం గారు

ఆర్థికసహాయం చేశారు. నా తరపున, మా జగద్గురు పీఠం - గుంటూరుశాఖ తరపున వీరికి ప్రత్యేక కృతజ్ఞతాభి వందనాలను తెల్పుకుంటున్నాను. అమ్మవారి అనుగ్రహం పరిపూర్ణంగాఉండి - వీరు, వీరి కుటుంబ సభ్యులు - ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని అమ్మవారిని ప్రార్థిస్తున్నాను.

గుంటూరు — ఇట్లు

16.8.2002 — జి.ఎల్.ఎన్. శాస్త్రి

# విన్నపము

పఠనఫలంగా సుఖసంపదలను ప్రసాదించే ఈ 'మహిషా సురమర్దినీ స్తోత్ర వివరణ' లక్షప్రతులను ముద్రించి, పాఠక భక్తులకు అందించి, వారి హృదయక్షేత్రాలలో భక్తి బీజాలను పెంపొందింప జేయాలని మా సంకల్పం.

ఈ సందర్భంలో ఈ పుస్తకముద్రణ యజ్ఞానికి రూ. 1000/- విరాళంగా ఇచ్చే దాత పేరు రాబోయే ప్రతిలో ముద్రించడమే కాక, ఇచ్చిన 1000 రూపాయలకు ప్రతిఫలంగా వారికి 51 పుస్తకాలు ఉచితంగా పంపడం జరుగుతుంది. ఒక ప్రతిని తాము ఉంచుకుని, మిగిలిన 50 ప్రతులను తమ బంధుమిత్రులకు మంగళకరమైన కానుకలుగా అందజేయవచ్చును.

లక్షప్రతుల లక్ష్యసాధనలో మీరూ భాగస్వాములై సహకరించి, అమ్మవారి కృపకు పాత్రులు కావలసినదిగా కోరుచున్నాము. డి.డి.గాని, ఎమ్.ఒ.గాని "The World Teacher Trust, Guntur" పేరున పంపవలసినదిగా మనవి.

ఇట్లు

ప్రచురణ కర్తలు

# ముందుమాట

ఆధ్యాత్మిక ప్రసంగాల నిమిత్తం నేను హైదరాబాదు ప్రతిసంవత్సరము ఫిబ్రవరి నెలలోను, ఆగస్టు నెలలోను వెళ్తాను. ప్రసంగాలు ఉన్న నాలుగు రోజులు నా ప్రియమిత్రుడు సింగరాజు శివప్రసాద్ స్వగృహంలో ఉంటాను. ఇటీవల 2002 ఫిబ్రవరి నెలలో 21-2-02న జరిగిన చివరిరోజు కార్యక్రమంలో సాయంత్రం “శివానందలహరి” పై ప్రసంగించడం జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో, కామర్సు ప్రొఫెసర్‌గా పనిచేసి రిటైర్ అయినవారు, యువభారతి పుస్తక ప్రచురణ సంస్థ ముఖ్య కార్యకర్త, అయిన ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథంగారు నాటి సభకు అధ్యక్షత వహించారు. నాతో వ్యక్తిగతంగా కొన్ని విషయాలు మాట్లాడాలని సభా ప్రారంభానికి ఒక గంట ముందే వచ్చారు. ఆయన చాలా ప్రాక్టికల్‌గా ఉండే ముక్కుసూటి మనిషి. తను వచ్చిన పనిచెప్పి ఇక అసలు సంగతికి వస్తానన్నారు. నేను ‘రండి’ అన్నాను.

**పుస్తక ప్రస్తావన :**

“గాయత్రి, శ్రీ లలితా సహస్రనామ వివరణ, సౌందర్యలహరికి వ్యాఖ్యానం ఇలా అమ్మవారి విషయాలపై ప్రత్యేకంగా శాస్త్రవిజ్ఞానాన్ని జోడిస్తూ ఆధునికుల హృదయాలకు హత్తుకునే విధంగా మీరు వివరించడం

నాకు బాగా నచ్చింది. మేము యువభారతి సంస్థ ద్వారా ఎన్నో పుస్తకాలు లోగడ ముద్రించి పాఠకులకు అందజేశాము. పుస్తక ప్రచురణ రంగంలో మాకు సరిపడినంత అనుభవం ఉంది. మీరు గనక మహిషాసుర మర్దినీ స్తోత్రానికి మీ పద్ధతిలో వివరణ వ్రాసి ఇస్తే ప్రచురించాలని ఉంది" అని విశ్వనాథంగారు అన్నారు. అలా అంటూనే "లక్ష ప్రతులు మా లక్ష్యం" అన్నారు. "లక్ష్యం బాగానే ఉంది లక్షలు ఖర్చుపెట్టాల్సి వుంటుంది" అన్నాను నేను. "ఆ లక్ష్యాన్ని మాకు వదిలివెయ్యండి, మీ లక్ష్యాన్ని మీరు నెరవేర్చండి" అన్నారు ఆయన. ఇలాంటి పనులకు పూర్తిగా అమ్మవారి అనుగ్రహంపైనే ఆధారపడ్డనేను – "అలాగే, అయితే మే నెలనుండి గాని ఆ పనిని ప్రారంభించలేను అన్నాను". "ఫర్వాలేదు 2002 అక్టోబర్ నెలలో వచ్చే దసరాల్లో పుస్తకం ఆవిష్కరణ అయ్యేటట్లుగా మాకిస్తేచాలు", అయితే ఒక్క చిన్నకోరిక – పుస్తకంలో ఎక్కడో ఒక చోట ఈ పుస్తకం మా నాన్నగారికి అంకితం ఇస్తున్నట్లు తెలియపరచాలి" అన్నారు. ఆయన కోరికను నేను కాదనకుండా ఒప్పుకున్నాను.

**వివరణ దశ :**

2002 మే నెలలో ఒక ఐదు రోజులలో మొదటి ఐదు శ్లోకాలు వివరణ పూర్తయి ఆగిపోయింది. మళ్ళీ జూన్ నెలలో ఒక ఆరు రోజులలో ఆరు శ్లోకాల వివరణ వచ్చి ఆగిపోయింది. చివరకు జూలై నెలలో 23 నుండి 26 తేదీలలో మిగిలిన ఏడు శ్లోకాలు పూర్తయాయి. నెల సంఖ్యతో ఆ నెలలో పూర్తయిన శ్లోకాల సంఖ్య సరిపోవడం ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఈ విధంగా అమ్మవారు నాకు అనుగ్రహించి అందించిన విషయాలను ఇలా పుస్తక రూపంలో మీ ముందుంచాను.

దేవీ భాగవతంలోని పంచమస్కంధంలో చెప్పబడిన "మహిషాసుర వృత్తాంతానికి సంబంధించిన కథకూడా వేరే శీర్షికలో తెలుపబడినది.

శ్లోకాలన్నింటిని వరుసగా చదువుకోవడానికి వీలుగా ఉంటుందని పాఠకుల సౌకర్యార్థం ప్రత్యేకంగా నాలుగు పేజీలలో ఈ శ్లోకాన్ని ముద్రించి జతచేయడం జరిగింది.

**కృతజ్ఞతలు :**

జన్మనిచ్చిన జననీజనకులకు, జ్ఞానమిచ్చిన గురుదేవులు ఎక్కిరాల కృష్ణమాచార్యులవారికి – నా ప్రణామములు. మాన్యమిత్రులు శ్రీ మన్నవ గిరిధరరావుగారి సంపాదకత్వంలో నడచిన "భారతీయ మార్గము" అనే మాసపత్రికలో సంక్షిప్తంగా స్తోత్రానికి అర్థతాత్పర్యాదులు డా॥ డి.ఎన్. దీక్షిత్‌గారు లోగడ వ్రాయడం జరిగింది. నేను వాటిని చదివాను. ప్రస్తుత వివరణలోని శ్లోకాల అర్థాలకు వారిచ్చిన అర్థాలనే నేపథ్యంలో పెట్టుకుని వ్రాశాను. ఈ మిత్రులిద్దరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

స్తోత్రవివరణ రావడానికి కారకులై, పుస్తక ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథంగారికి; హైదరాబాదులో ప్రసంగాల ప్రారంభానికి ప్రేరకుడైన నా ప్రియమిత్రుడు ఎస్. ఎస్.

ప్రసాద్‌కు, అతని సతీమణి చి.సౌ.విజయలక్ష్మికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

DTP చేసి ఇచ్చిన చి॥ సౌ. ఇందిరకు, సుందరంగా ముద్రించి ఇచ్చిన విజయసాయి ఆఫ్‌సెట్ ముద్రణాలయమువారికి, టైటిల్ పేజీని సుందరంగా తీసుకు రావడానికి సహకరించిన చి॥ ఎమ్.వి. రమణకుమార్‌కు, చి॥ టి. శ్యామనారాయణకు నా శుభాభినందనలు, శుభాశీస్సులు.

నేను భౌతిక శాస్త్ర అధ్యాపకుణ్ణి కాబట్టి స్తోత్ర వివరణలో వ్యాకరణ పరమైన దోషాదులు ఏమైనా వుంటే పండితులు విషయ వివరణానికే ప్రాధాన్యమిచ్చి సహృదయంతో సర్దుకుపోవలసినదిగా నా మనవి.

"ఈ పుస్తకాన్ని ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథంగారి తండ్రిగారైన కీ.శే.**వంగపల్లి నీలకంఠంగారికి** అంకితం ఇస్తున్నాను". విశ్వనాథంగారి కుటుంబ సభ్యులకు, పాఠక సోదరులందరికీ అమ్మవారి అనుగ్రహం పరిపూర్ణంగా వుండాలని ప్రార్థిస్తున్నాను.

గుంటూరు
30.7.02

వివరణకర్త,
జి.ఎల్.ఎన్. శాస్త్రి

# పీఠిక

## స్తోత్రకర్త

భారతీయుల వివిధ ఆరాధ్యదైవాల గురించి నిష్పక్షపాతంగా, సంకుచితభావాలు లేకుండా వేద వ్యాసులవారు పద్దెనిమిది పురాణాల్లో వ్రాశారు. అలాంటి వ్యాసులవారి మార్గాన్నే అనుసరించిన వారెవరైనా ఉన్నారా అంటే, ఆయన 'ఆదిశంకర భగవత్పాదులే'! శంకరులు శివునిపరంగా 'శివానందలహరి', అమ్మవారి పరంగా - 'సౌందర్యలహరి' విష్ణు సహస్రనామ వ్యాఖ్యానము, లక్ష్మీనరసింహస్వామిపరంగాను, లక్ష్మీదేవి పరంగాను, శ్రీరాముని పరంగా ... ఇలా ఎందరో దేవతల పరంగా స్తోత్రాలు వ్రాశారు. అందరిలోను ఉన్న ఒకే సర్వాంతర్యామిని చూడగలిగిన 'అద్వైత' దృష్టి గలవారు మాత్రమే ఇలా త్రికరణ శుద్ధిగా, నిష్పక్షపాతంగా సర్వదేవతా స్తుతులను వ్రాయగలరు.

పైన తెల్పిన స్తోత్రాలతోపాటు ప్రస్తుత 'మహిషాసురమర్దినీ స్తోత్రం' గూడా ఆదిశంకరకృతమే ! ఇలా శంకరుల ద్వారా ఇవన్నీ రావడం మనందరి పురాకృతసుకృతమే! ఈ స్తోత్రంలోని శ్లోకాల శైలినిబట్టి తప్పకుండా స్తోత్రం శంకర కృతమేఅయి ఉండాలని విజ్ఞుల అభిప్రాయం. శాబ్దిక పద విన్యాసం, - ఛందోగమనంతో పోటీపడుతూ శ్లోకాలను

చదువుతుంటే – పాఠకుల హృదయాల్లో ఉద్వేగాన్ని, ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని కలుగజేస్తాయి. భక్తి ఉప్పొంగుతుంది. ఇది శంకరుల శైలిలోని ప్రత్యేకత. ఆయన రచించిన అన్ని రకాల స్తోత్రాలలోను ఈ విషయం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది, వినిపిస్తుంది.

## స్తోత్ర విషయం

దేవీ భాగవతంలోని పంచమస్కంధంలో చెప్పబడిన మహిషాసురాదులకు, అమ్మవారికి మధ్య జరిగిన మహాసంగ్రామంలో అమ్మవారి విజృంభణను కళ్లకు కట్టినట్లు వర్ణిస్తూ శంకరులు రచించిన స్తోత్రమే ఈ మహిషాసురమర్దినీ స్తోత్రము. ఈ స్తోత్రంలో పద్దెనిమిది శ్లోకాలుంటాయి. ఈ పద్దెనిమిది శ్లోకాలు 'కవిరాజ విరాజితం' అనే ఛందస్సులో వ్రాయబడ్డాయి. చివరకు ఫలశ్రుతిగా వేరే ఛందస్సులో ఒక చిన్న శ్లోకం ఉంటుంది. మిత్రులు డా॥ డి.ఎన్. దీక్షిత్‌గారు చెప్పినట్లు "ఈ స్తోత్రం పాఠకుల, శ్రోతల పారవశ్యానికి పవిత్ర గంగా తరంగం. ప్రతిశ్లోకం చివర మధురకింకిణిలాగా ధ్వనించే 'జయ జయహే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని ! శైలసుతే !' అనే మకుటం అతి మనోహరంగా వుంటుంది." ప్రతి శ్లోకంలోను రెండు సార్లు 'జయ' శబ్దం ఉచ్చరించబడుతుంది కాబట్టి – నిత్యం ఈ స్తోత్రాన్ని చదివేవారు – అమ్మవారి అనుగ్రహానికి పాత్రులై – 'జయా'నికి 'విజయా'నికి అలవాటుపడిపోతారు.

## 'జయ' పద విశిష్ఠత

ఈ స్తోత్ర మకుటము లోని 'జయ' అనే పదం చాలా విశిష్టమైంది. అక్షరాలకు, అంకెలకు (Digits) మధ్య గల ఈ క్రింద తెలిపిన సంకేత సంబంధాన్ని వరరుచి సూచించాడు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | | |

ఈ అక్షరాలకు అంకెలకు గల సంబంధాన్ని ఉపయోగించి పురాణ ఇతిహాస కథల్లోని ఎన్నో విశేషాలను కొందరు వివరించారు. ఈ పట్టికలో తెల్పిన దానిని బట్టి 'జ' అక్షరం 8 అంకెను, 'య' అక్షరం 1 అంకెను సూచిస్తాయి అని తెలుస్తోంది గదా ! కాబట్టి 'జయ' అనే పదం '81' సంఖ్యను (Number) సూచిస్తుంది. సంస్కృతంలో 'అంకానాం వామతోగతిః' అన్న సూత్రం ప్రకారం పదంలోని అక్షరాలు సూచించే సంఖ్యను తెలుసుకోవాలంటే – పదంలోని అక్షరాలు తెలిపే అంకెలను కుడి నుండి ఎడమ వైపుగా వేసుకుని సంఖ్యను ఏర్పరచుకోవాలి. ఉదాహరణకు పైన తెల్పిన "జయ" పదమేతీసుకుంటే – జ –8, య–1

అంకెలను సూచించినా ఈ అంకెలను ఎడమ వైపుగా తారుమారు చేస్తూ 1, 8 వరుసలో వ్రాసి – 'పద్దెనిమిది'గా గుర్తించాలి. దీనిని బట్టి 'జయ' అనే పదం "18" సంఖ్యను తెలుపుతుందని తెలుస్తోంది గదా !(భారతంలోని పర్వాల సంఖ్య 18, భగవద్గీతలోని అధ్యాయాల సంఖ్య 18 ఉండడంలో గూడా ఈ "జయ" పద విషయాన్ని సూచిస్తాయి. అసలు భారతానికి 'జయ' మనేదే మొదటి పేరు.

**("నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో 'జయ' ముదీరయేత్"**

అని ప్రార్థనా శ్లోకంగా భారతాన్ని చెప్పేముందు చదువుతారు.)

## 18 శ్లోకాలే ఎందుకు ?

మహిషాసురుణ్ణి మర్దించిన అమ్మవారికి పద్దెనిమిది బాహువులు ఉంటాయి. అమ్మవారి పద్దెనిమిది బాహువుల పరాక్రమాన్ని స్తుతించేందుకు 18 శ్లోకాల్లో ఈ స్తోత్రాన్ని ఆదిశంకరులు రచించారు.

## ఈ ఛందస్సే ఎందుకు ?

మహిషాసురునితో జరిగిన మహాసంగ్రామంలో అమ్మవారికి– ఎవ్వరికీ సాధ్యపడని "జయం" సిద్ధించింది. ఈ విషయాన్ని మారు మ్రోగేట్లు దండోరా వేయించి చెప్పేటట్లుగా ఉండడం కోసం ప్రతి శ్లోకం చివరలో 'జయ జయహే' అని పునరుక్తం అయేట్లుగా శ్లోకాల మకుటాన్ని

ఎన్నుకున్నారు. యుద్ధంలోని సైనిక పద విన్యాస ఘోష వినబడేట్టుగా ఉండి, స్తోత్ర పఠనంతో ఒక విధమైన ఊపు, ఉద్వేగం వచ్చి ఉత్తేజం కలగడం కోసం ఈ 'కవిరాజవిరాజితం' ఛందస్సును ఎన్నుకున్నారు. అయితే, భక్తిపారవశ్యంతో చెప్పిన 8, 18 శ్లోకాలలో గణ ప్రాముఖ్యం కన్న గమన ప్రాధాన్యమే ఎక్కువ పాటింపబడినట్లు తోస్తుంది. అయినా, ప్రతిపాదం 30 మాత్రల కాలగమనానికి సరిపోతుంది. (ఒక 'మాత్ర' – ఒక హ్రస్వాక్షరాన్ని ఉచ్చరించడానికి పట్టే కాలాన్ని సూచిస్తుంది. దీన్ని బట్టి ఈ వృత్తంలోని ఒక్కొక్క పాదాన్ని చదవడానికి – 30 లఘువుల లేదా హ్రస్వాక్షరాలు ఉచ్చరించటానికి పట్టేకాలం పడుతుంది.)

## వివరణ విషయాలు

శ్లోకాలకు బాహ్యార్థమే కాకుండా అంతరార్థాలు, యోగపరమైన విశేషార్థాలు గూడా ఉంటాయి. నాకు అమ్మవారు అనుగ్రహించినంత వరకు వాటిని సరళమైన వ్యావహారిక భాషలో వివరించాను. అయితే – ఈ శ్లోకాలలోని ఇలాంటి భావాలను అర్థం చేసుకోవాలంటే –'దేవీ భాగవతం', 'శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం', 'సౌందర్యలహరి' ఇత్యాది గ్రంథాలుకూడా చదివి వుంటే వివరణ బాగా అర్థమౌతుంది. ఈ స్తోత్ర వివరణ మరింత బాగా అర్థమవాలంటే – ముఖ్యంగా శ్రీ లలితా సహస్రనామ స్తోత్రానికి, సౌందర్యలహరికి నేను వ్రాసిన వివరణ గ్రంథాలు గూడా చదవండి.

## ఫలశ్రుతి

సుఖసంపదలు కలగడం ఈ స్తోత్రానికి ఫలశ్రుతిగా ఆదిశంకరులే చిట్టచివరి 19వ శ్లోకంలో చెప్పారు. మళ్లీ నేను వేరే ఫలశ్రుతిని చెప్పవలసిన అవసరం లేదు. పఠించిన వారికి పఠించినంతగా ప్రసన్నురాలై పరమేశ్వరి వారికి కావలసినవి ప్రసాదిస్తుంది.

– జి. ఎల్.ఎన్. శాస్త్రి

# దేవీ భాగవత కథ

పూర్వం మహిషుడనే దానవరాజు భూమిని పాలిస్తూ తనకు తిరుగులేని ఆధిపత్యం కోసం మేరు పర్వత శృంగం మీద తపస్సు చేశాడు. బ్రహ్మ ఆ తపస్సుకు మెచ్చి హంసవాహనంపై వచ్చి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. తనకు చావు రాకుండా వరమిమ్మని మహిషుడడిగాడు. పుట్టినవాడు గిట్టక తప్పదు కాబట్టి ఏదో ఒకరకంగా గాని, ఎవరో ఒకరి వలననో గాని మరణము తప్పదు కాబట్టి - మరణము తప్ప మరి ఏదైనా వరాన్ని కోరుకోమన్నాడు. అబలలు అందరి కంటె బలహీనులని, సుకుమారులని నిర్ణయించుకుని అబల తప్ప మరి ఇతరులెవరివలనగూడా తనకు మరణం సంభవింపకూడదని వరం కోరగానే బ్రహ్మ 'తథాస్తు' అన్నాడు.

## మహిషుని పుట్టు పూర్వోత్తరాలు

దనువు దానవులకు రాజుగా భూమిని పరిపాలించాడు. ఆ దనువుకు 'రంభుడు', 'కరంభుడు' అని ఇద్దరు కొడుకులు. ఆ ఇద్దరికి సంతతి లేదు. సంతానార్థమై తపస్సు చేద్దామనుకున్నారు. కరంభుడు నీళ్లల్లో నిల్చి తపస్సు చేస్తూ ఉండగా ఇంద్రుడు మొసలి రూపంలో వచ్చి వాణ్ణి చంపాడు. రంభుడు పంచాగ్ని మధ్యలో నిలిచి తపస్సు చేస్తుండగా అగ్ని దేవుడు మెచ్చి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అందుకు రంభుడు

ముల్లోకాలను జయించగల పుత్రుణ్ణి ఇవ్వమని అడిగాడు. అందుకు అగ్ని అంగీకరించి – 'ఎవరిపై నీకు కామవాంఛ కలుగుతుందో ఆమె ద్వారా నీకు తనయుడు కలుగుతాడు' అని చెప్పి అంతర్ధానమౌతాడు.

ఒకనాడు రంభుడు గిరిశృంగము మీద ఒక మహిషాన్ని చూడగా కామ భావన కలిగింది. అప్పుడు ఆ రంభుని వలన ఆ మహిషం గర్భం ధరించింది. ఒకసారి రంభుడు తన పట్టమహిషితో పాతాళ లోకానికి వెళ్లాడు. అక్కడ ఒక మహిషము ఈ రంభుని పట్టమహిషిని చూడగానే కామం గలిగి దగ్గరగా వచ్చి కలిసింది. ఆ సమయంలో రంభుడక్కడకు వచ్చి మహిషాన్ని ఎదుర్కోబోయాడు. కాని ఆ మహిషం రంభుణ్ణి తన కొమ్ములతో పొడిచి చంపింది. రంభుని మహిషి భయంతో యక్షులను రక్షణ కోరగానే – తరుముకుంటూ వస్తున్న మహిషాన్ని బాణాలు విడిచి చంపేశారు. చనిపోయిన రంభుని మృతదేహాన్ని యక్షులు వెదికి చితిచేస్తే – రంభుని మహిషి తాను గర్భవతి అని గూడా పట్టించుకోకుండా, యక్షులు వారించినా వినకుండా తన పతితో సహగమనానికి చితినెక్కింది. చితి జ్వాలలు వంటికి సోకగానే గర్భచ్యుతి జరిగి మహిషాసురుడుద్భవించాడు. పుత్రవాత్సల్యంతో రంభుడే తర్వాత రక్తబీజుడుగా జన్మించాడు. మహిషుడు తపస్సులు చేసి వరాలు పొంది ముల్లోక వాసులను ముప్పుతిప్పలు పెట్టసాగాడు. మహిషుని దుశ్చర్యలు దురాగతాలకు హరిహరబ్రహ్మాదులు, దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుషాదు లెవ్వరూ ఏమీ చేయలేకపోగా – మహిషుడు పెట్టే అన్ని విధాల బాధలకు లోనయారు.

## అమ్మవారి ఆవిర్భావం

మహిషుడు పెట్టే బాధలు తట్టుకోలేక దేవతలందరూ కార్యాచరణ నిమిత్తం ఒకచోట చేరి ధ్యాన నిమగ్నులయారు. అప్పుడు సర్వదేవతల అంశములు కలసి ఒక మహాతేజఃపుంజం వారి నుండి వెడలి ప్రత్యక్షమైంది. అసురుల ఆటలను అరికట్టి మహిషుని మరణానికి ఉద్భవించిన ఆ మహారూపానికి శివుని తేజస్సు ముఖం (నోరు) గాను, యముని అంశతో నునుపుగాను, నల్లగాను ఉండే కేశపాశం, అగ్ని తేజస్సుతో త్రినయనాలు, సంధ్యా తేజస్సుతో తుమ్మెద రెక్కల వంటి నల్లని కనుబొమలు విల్లు ఆకారంలోను ఉత్పన్నమయాయి. వాయు దేవుని తేజస్సుతో శ్రవణేంద్రియాలు భాసించాయి. కుబేరుని తేజస్సుతో ముక్కు, ప్రజాపతి తేజస్సుతో మల్లె మొగ్గల్లాంటి దంతపంక్తి, అరుణుని తేజస్సుతో పెదవులు, విష్ణువు అంశతో బాహువులు, వసువుల అంశతో వ్రేళ్లు, చంద్రుని అంశతో స్తనాలు, ఇంద్రుని తేజస్సుతో త్రివళులతో నడుము, భూమి అంశతో పిరుదులు – ఏర్పడి అష్టాదశ భుజాలతో ఒక మహా మాయా రూపం ఆవిర్భవించింది.

## దేవికి సమకూర్చిన ఆయుధ విభూషణాలు

హరి హర బ్రహ్మేంద్రాదులందరి అంశలు కలసి ఏర్పడిన ఆ మహామాయా దేవికి సకల ఆయుధాలు, సకల ఆభరణాలు సమకూర్చారు. క్షీరాబ్ధిదేవత దివ్యవస్త్రాలను, విశ్వకర్మ వెలుగులు విరజిమ్మే చూడామణిని,

కటకకుండలాలను, కేయూర కంకణాలను; త్వష్ట ప్రజాపతి రత్న ఖచిత నూపురాలను; సముద్రుడు కంఠాభరణాలను, రత్నాంగుళీయకాలను; వరుణుడు వాడిపోని పద్మమాల, వైజయంతిని; హిమవంతుడు వివిధ రత్నాలతో పొదగబడిన కనక సింహాసనాన్ని సమకూర్చారు. సింహ వాహనం మీద నానావిధ భూషణాలతో విరాజిల్లే ఆ మహామాయాదేవికి విష్ణువు వేయి అంచుల చక్రాన్ని, శివుడు త్రిశూలాన్ని, వరుణుడు శంఖాన్ని, అగ్ని మనోవేగంతో పోగలిగి, వందమందిని మట్టుపెట్టే శక్తిని, వాయుదేవుడు అక్షయ తూణీరాలను, దివ్యమైన ధనుస్సును ఇచ్చారు. ఇంద్రుడు వజ్రాయుధాన్నిచ్చాడు. యముడు దండాన్ని; విశ్వకర్మ పరశువును ఇచ్చి – అందరూ వివిధ వేదమంత్రాలతో దేవిని స్తుతించారు. ఈ మహామాయాదేవియే – మదంతోను, కామంతోను విఱ్ఱవీగే మహిషాసురుణ్ణి, వాడిని ఆశ్రయించుకుని ఆగడాలు చేసే అసురవీరులందరినీ చీల్చి చెండాడి ముల్లోకవాసులను రక్షించింది.



# మహిషాసుర మర్దనీ స్తోత్రము

శ్లో॥ అయి గిరినందిని ! నందితమోదిని ! విశ్వవినోదిని ! నందినుతే !
గిరివర వింధ్య శిరో ఉధినివాసిని ! విష్ణువిలాసిని జిష్ణునుతే !
భగవతి హే శితికంఠకుటుంబిని ! భూరికుటుంబిని భూరికృతే !
జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే ! 1

శ్లో॥ సురవరవర్షిణి ! దుర్ధర ధర్షిణి ! దుర్ముఖిమర్షిణి ! హర్షరతే !
త్రిభువన పోషిణి ! శంకరతోషిణి ! కల్మషమోచని ఘోరరతే !
దనుజవిరోషిణి ! దుర్మదశోషిణి ! దుఃఖవినాశిని ! సింధుసుతే !
జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 2

శ్లో॥ అయి జగదంబ ! కదంబవనప్రియ వాసవిలాసిని ! వాసరతే !
శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగనిజాలయ మధ్యగతే !
మధుమధురే ! మధుకైతవభంజని ! కైటవ భంజని ! రాసరతే !
జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 3

శ్లో॥ అయి నిజహుంకృతి మాత్ర నిరాకృతి ధూమ్రవిలోచని ! ధూమ్రశిఖే!
సమర విశోణిత బీజసముద్భవ బీజలతాధిక బీజలతే !
శివ ! శివ! శుంభ నిశుంభ మహాహవ తర్పిత భూత పిశాచ-పతే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే ! 4

శ్లో॥ అయి భో శతముఖ ఖండిత కుండలి తుండిత ముండ గజాధిపతే !
రిపు గజగండ విదారణ ఖండ పరాక్రమ శౌండ మృగాధిపతే !
నిజ భుజదండ నిపాతిత చండ నిపాతిత ముండ భటాధిపతే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 5

శ్లో॥ హయరణ మర్మర శాత్రవ దోర్ధుర దుర్జయ నిర్జర శక్తిభృతే !
చతుర విచార ధురీణ మహాశివదూతకృత ప్రమథాధిపతే !
దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత దురంతగతే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 6

శ్లో॥ అయి శరణాగత వైరి వధూ వరకీర వరాభయ దాయికరే !
త్రిభువన మస్తక శూల విరోధి నిరోధకృతామల తూలకరే !
దుర్నమితావర దుందుభి నాద ముహుర్ముఖరీకృత దీనకరే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 7

శ్లో॥ సుర లలనాతత థేయిత థేయిత తాల నిమిత్తజ లాస్యరతే !
కకుభాంపతి వర థోంగత తారక తాల కుతూహల నాదరతే !
ధిం-ధిం-ధిమికిట-ధిం-ధిమిత ధ్వని ధీర మృదంగ నినాదరతే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 8

శ్లో॥ ఝణఝణఝణహింకృత సురనూపుర శింజిత మోహిత భూతపతే!
నటిత నటార్థ నటీనట నాయక నాటిత నాటక నాట్యరతే
పదనత పాలిని ! ఫాలవిలోచని ! పద్మవిలాసిని ! విశ్వధురే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 9

శ్లో॥ దనుజ సుసంగర రక్షణ సంగర పరిస్ఫురదంగ నటత్కటకే !
కనక నిషంగ పృషత్క నిషంగ రసద్భట భృంగ హటావటకే !
హత చతురంగబల క్షితిరంగ ఘటద్బహురంగ వలత్కటకే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 10

శ్లో॥ మహిత మహాహవ మల్లమతల్లిక వేల్ల కరేరక భిక్షురతే!
విరచిత వల్లిక వేల్లిత గల్లక మల్లిక భిల్లిక వర్గయుతే!
భృతికృత ఫుల్ల సముల్ల సితారుణ పల్లవ తల్లజ చారుతనో!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 11

శ్లో॥ అయి సుమనస్సు మనస్సు మనోహర కాంతిలసత్కల కాంతియుతే!
సుత రజనీ రజనీ రజనీ రజనీకర వక్త్ర విలాసయుతే!
నయన సువిభ్రమ విభ్రమద భ్రమర భ్రమరాధిప విశ్వనుతే
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 12

శ్లో॥ అవిరళ గండక మేదుర సమ్మద మత్త మతంగజ రాజగతే!
త్రిభువన భూషణ భూత కళానిధి రూప పయోనిధి రాజసుతే!
అయి సుదతీజన లాలస మానస మోహన మన్మథ రాజగతే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే. 13

శ్లో॥ కమల దళామల కోమల కాంతి కలా కలితాకుల బాలలతే!
సకల కలావిచయక్రమకేలి చలత్కల హంస కులాలికులే!
అలికుల సంకుల కువలయ మండిత మౌళి లసత్సమదాలికులే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 14

శ్లో॥ కల మురళీరవ వాజితకూజిత కోకిల మంజుల గానరతే!
మిళిత మిళింద మనోహర గుంఫిత రాజతశైల నికుంజగతే!
మృగ గణ భూత మహా శబరీగణ రింఖణ సంభృత కేళియుతే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 15

శ్లో॥ కటి తట నీత దుకూల విచిత్ర మయూఖ సురంజిత చంద్రకలే!
నిజ కనకాచల మౌళి పయోగత నిర్ఝర కుంజర చారురుచే!
ప్రణత సురాసుర మౌళి మణిస్ఫుర దంశు లతాధిక చంద్ర రుచే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 16

శ్లో॥ విజిత సహస్రకరైక సహస్ర సుధాకర రూప వరైక నుతే!
కృత సుత తారక సంగర తారక తారక సంగర సంగనుతే!
గజముఖ షణ్ముఖ రంజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 17

శ్లో॥ పదకమలం కమలానిలయే! వరివస్యతి యో ఽనుదినం సశివే
అయి కమలే! విమలే! కమలానిల శీకర సేవ్యముఖాబ్జ శివే!
తవ పదమధ్య హి శివదం దృష్టి పథం గత మస్తుచ తస్య శివే!
జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 18

## ఫలశ్రుతి

శ్లో॥ స్తుతిమితి స్తిమితస్తు సమాధినా
నియమతో యమతో ఽనుదినం పఠేత్
పరమయా రమయా సతు సేవ్యతే
పరిజనో ఽపి జనో ఽపి చ తం భజేత్

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

శ్రీ గణేశాయ నమః

శ్రీ మత్త్రిపుర సుందర్యై నమః

# మహిషాసురమర్దిని స్తోత్ర వివరణము

శ్లో॥ అయి గిరినందిని ! నందితమోదిని ! విశ్వవినోదిని ! నందినుతే !
గిరివర వింధ్య శిరో ఽధినివాసిని ! విష్ణువిలాసిని జిష్ణునుతే !
భగవతి హే శితికంఠకుటుంబిని ! భూరికుటుంబిని భూరికృతే !
జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే ! 1

## అర్థము

అయి = ఓ (తల్లీ!), గిరినందిని = హిమవత్పర్వతరాజ పుత్రికా!, నందిత మోదిని = ఆనందపరచువారిని సంతోషపరచుదానా !, విశ్వవినోదిని = విశ్వమును వినోదింప జేయుదానా !, నందినుతే = నందీశ్వరునిచే స్తుతింపబడుదానా !, గిరివరవింధ్య శిరో ఽధినివాసిని = పర్వతములలో శ్రేష్ఠమైన వింధ్యాద్రి శిఖరముపై నివశించుదానా!, విష్ణు విలాసిని = విష్ణువిలాసమునకు మూలకారణమైన దానా !, జిష్ణునుతే = ఇంద్రునిచే స్తుతింపబడుదానా !, శితికంఠ కుటుంబిని= శివుని ప్రియపత్నీ!, భూరికుటుంబిని = విశ్వమే సంసారమైన గృహిణీ !, భూరికృతే= గొప్ప గొప్ప పనులు (అవలీలగా) చక్కబెట్టుదానా ! లేదా

గొప్పగా అనుగ్రహించుదానా!, రమ్యకపర్దిని = చూడచక్కని కురుల కూర్పులతో జడల ముడులు గలదానా!, శైలసుతే = శైలరాజపుత్రీ !, హే భగవతి = ఓ భగవత్స్వరూపిణీ !, హే మహిషాసుర మర్దిని = ఓ మహిషాసురుని మర్దించి వధించినదానా !, జయ జయ = (నీకు) జయ పరంపర అగుగాక !

## తాత్పర్యము

ఓ తల్లీ ! హిమశైలపుత్రీ ! ఆనందపరచువారిని సంతోష పరచుదానా! విశ్వమును వినోదింప చేయుదానా ! నందీశ్వరునిచే కీర్తింపబడుదానా ! వింధ్యాద్రిపై నివాసము గలదానా ! విష్ణు (మాయా) విలాసములకు మూలకారణమైనదానా ! ఇంద్రునిచే స్తుతింపబడుదానా! ఓ భగవత్స్వరూపిణీ ! శివుని ఇల్లాలా ! విశ్వ కుటుంబినీ ! గొప్ప గొప్ప పనులు చేయుదానా ! లేదా గొప్పగా అనుగ్రహించుదానా! అందమైన జడల ముడులు గలదానా ! మహిషాసురుని వధించిన దానా ! నీకు జయపరంపర అగుగాక !

## విశేషాంశములు

**అయి :** పూజనీయురాలైన అమ్మవారిని అత్యంత భక్తి పూర్వక సాన్నిహిత్యంతో "ఓ తల్లీ" అని పిలవడానికి సంబోధన పూర్వకంగా ముందు చెప్పే సంస్కృత పదం "అయి!" 'అయీ' పదానికి సంబోధన ప్రథమా విభక్తి రూపమే "అయి". మన అమ్మకు మనపై ఎంత చనవు,

ప్రేమ ఉంటాయో అటువంటి చనవు, ప్రేమలే అమ్మవారికి గూడా మన పట్ల ఉంటాయని, మనం అల్లరి పనులు చేసినపుడు తప్ప మిగతా సమయాల్లో ఆప్యాయంగా వుండే అమ్మలాంటిదే అమ్మవారు గూడా అని ఈ "అయి" పద ప్రయోగం సూచిస్తుంది. శ్రీ 'లలితా సహస్ర నామాల్లో 'అయీ' అనేది అమ్మవారి ఒక నామం అని ఇక్కడ స్ఫురణకు రావాలి.

**గిరినందిని :** 'గిరిజా' అంటే పర్వతరాజుకు పుట్టినది అని మాత్రమే అర్థం. కాని, 'గిరినందిని' అంటే – 'పర్వతరాజుకుపుట్టి, ఆ రాజుకు ఆనందకారకురాలైనటువంటి ది' అనే అర్థం కూడా వస్తుంది.

'గిరి' అంటే 'పర్వతం' అనే అర్థమే కాకుండా, 'గిరా' అంటే 'వాక్కు' అనే అర్థాన్ని బట్టి 'గిరి' అనగా 'వాక్కు' నందు అంటే – స్తుతుల యందు, 'నందిని' అనగా 'ఆనందించేది' అని అర్థం వస్తుంది. అందువలన 'గిరినందిని' అనే సమాసానికి 'స్తుతుల ద్వారా ఆనందించేది' అని, 'ఆశీర్వచనాల ద్వారా' అంటే 'వరాల నివ్వడం ద్వారా ఆనందింప జేసేది' అని గూడా అర్థాలు వస్తాయి.

**నందితమోదిని :** (తనను, తన ప్రాణికోటిని) ఆనందింపజేసే వారిని ఆనందింప జేస్తావు అనే అర్థంతోబాటు ఏడిపించే వారిని ఏడిపిస్తావు, బాధలు పెట్టేవారిని బాధలు పెడతావు అనే సూచన గూడా ఈ సంబోధనలో వుందని గ్రహించాలి.

**విశ్వవినోదిని :** "విరులు, ఝరులు, తరులు, గిరులతో

శోభాయమానంగా ఆకర్షణీయమైన ప్రకృతి స్వరూపిణిగా – రకరకాల పాత్రధారులతో నడపబడే జగన్నాటక సూత్రధారిణిగా – చిత్రవిచిత్రమైన విజ్ఞాన వినోద విహార పుణ్యయాత్రా స్థలాలతో – అందరినీ ఆనందపరచేది" – అనే అర్థం ఈ "విశ్వ వినోదిని" పద ప్రయోగంలో ఉంది.

**నందినుతే :** 'నందీశ్వరునిచే నుతింపబడుదానా!' అని బాహ్యార్థం. నందీశ్వరుడు – వృషభముఖుడు. "యశ్ఛందసామృషభో విశ్వరూపః" "చత్వారి శృంగా త్రయోఽస్యపాదా। ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య ॥ త్రిధాబద్ధో వృషభో రోరవీతి । మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ" అన్న తైత్తిరీయ వచనాల ప్రకారం – నంది సాక్షాత్తు శ్రేష్ఠమైన ప్రణవ స్వరూపమే! 'ప్రణవ పూర్వకంగా నుతింపబడేది' అని ఈ సంబోధన సూచిస్తుంది. "నందివిద్యా" అనే శ్రీలలితా నామాన్ని గూడా ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**గిరివర వింధ్య శిరోఽధినివాసిని :** పర్వతాల్లో వింధ్యపర్వతానికి ఒక ప్రాముఖ్యం వుంది. ఉత్తర భారతదేశాన్ని దక్షిణ భారతదేశాన్ని విడదీస్తూ ఈ వింధ్యాద్రి మధ్యగా వుంటుంది. మనిషిని సరిగ్గా ఇలా రెండు భాగాలుగా విభజించే బిందువు 'నాభి' (అంటే బొడ్డు). నాభి ప్రాంతంలో ఉండే చక్రాన్ని 'మణిపూర చక్రం' అంటారు. ఈ మణిపూర చక్ర స్థానాన్ని అధివసించి ఉండే అమ్మవారిని "వింధ్యాచలనివాసిని" లేదా "గిరివరవింధ్య నివాసిని" అని అర్థం చేసుకోవాలి. "యశోదా గర్భంలో జన్మించిన నందగోపుని కూతురే వింధ్యాచలనివాసిని అయిన

'దుర్గాదేవి' –దేశానికి ఉప ద్రవాలను సృష్టించే శుంభ – నిశుంభులు అనే రాక్షసులను వధించినది, సింహారూఢియై మహిషాసురుణ్ణి వధించినది – ఈ దుర్గాదేవియే !" అని ఈ 'గిరివర వింధ్య నివాసిని" అనే సంబోధన సూచిస్తుంది. 'వింధ్యాచలనివాసినీ' అనే శ్రీలలితానామం ఈ అర్థాన్ని నిర్ధారిస్తుంది.

**విష్ణువిలాసిని :** యోగసాధన ప్రారంభ దశలో యోగ సాధకుణ్ణి పరీక్షపెట్టి మోహంలో పడేట్లుగా చేసే అమ్మవారి శక్తిని "విలాసినీ శక్తి' అంటారు. ఈ విలాసినీ శక్తి దయలేకపోతే యోగం సిద్ధించదు, సరిగదా యోగమార్గం సుగమంగా భాసించదు. అమ్మవారి అనుగ్రహంతో ఈ విలాసినీ లక్షణాన్ని పుణికి పుచ్చుకుని విష్ణుమూర్తి "జగన్మోహినీ" రూపంతో శివునితోసహా చాలా మందిని మోహంలో పడేశాడు. తన గమ్యాన్ని ధ్యేయాన్ని మరచి పోయేటట్లు చేసి భస్మాసురుణ్ణి తనంతకు తానే భస్మం అయ్యేట్లు చేశాడు. అసురులందరూ తన అందాన్ని చూస్తూ అబ్బురంగా మోహంలో పడేట్లు చేసి, దేవతలకు అమృతమంతా పంచి పెట్టాడు. అలాగే ప్రస్తుతం – 'ఈ విలాసినీ శక్తి తోనే – తన గమ్యాన్ని, లక్ష్యాన్ని మరచి పోయేట్లుగా చేసి మహిషాసురుణ్ణి గూడా అమ్మవారు మట్టికరిపించి మదాన్ని అణుస్తుంది' – అని సూచించడానికే 'విష్ణువిలాసిని' అని సంబోధించారు. శ్రీ లలితా సహస్ర నామాల్లోని 'విష్ణుమాయా', 'విలాసినీ' అనే నామాలను, 'సౌందర్యలహరి'లోని 'హరిస్త్వామారాధ్య ........." అనే 5వ శ్లోకాన్ని ఇక్కడ గుర్తుకు తెచ్చుకోవాలి.

**జిష్ణునుతే :** ఇంద్రియాలనే దేవతలకు మనస్సనే ఇంద్రుడు అధిపతి. దృఢమైన నిండు మనస్సుతో నుతింపబడే దానివి, అంతేగాని - నాలుక చివరి మాటలతో ముఖ స్తుతులు పొందే దానివి గాదనే అర్థాన్ని సూచించడం కోసం 'జిష్ణునుతే' అని శంకరులు సంబోధించారు.

**భగవతి :** 'భ' అంటే ప్రకాశిస్తూ 'గ' అంటే గమించేది. చలించే మెరుపులా అనంతకాలంలో చైతన్యవంతంగా చరిస్తూ, అందరి హృదయాల్లోను ప్రకాశిస్తూ ఉండేది' అని అర్థం. 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' అన్న గీతావాక్యానుసారంగా అందరి హృదయాల్లోనూ ఉండే ఈశ్వరుని స్వరూపమే ఈ 'భగవతి' అని అర్థం. 'భగవతీ', 'భగమాలినీ' - అనే శ్రీలలితానామాలు ఈ అర్థాన్ని నిర్ధారిస్తాయి.

**శితికంఠ కుటుంబిని :** శివుడు తెల్లగా కర్పూర గౌరవర్ణంలో వుంటాడు. కాబట్టి, ఆయన కంఠం గూడా తెల్లగానే వుంటుంది. అందుకని శివుణ్ణి "శితికంఠుడు" అంటారు. గరళం (విషం) మ్రింగి కంఠం వద్ద నిలిపాడు. కాబట్టి, కంఠం వద్ద కొంచెం ప్రదేశం మాత్రం నల్లగా వుంటుంది. అందుకని శివుణ్ణి 'గరళకంఠుడు' లేదా 'నీలకంఠుడు' అని గూడా అంటారు. గరళం మ్రింగినా కూడా వళ్లంతా నల్లబడి పోకుండా గరళం ఉన్న కొంచెం కంఠ ప్రదేశం తప్ప మిగతా శరీరమంతా తెల్లగానే ఉండేటట్లు చెయ్యగల సామర్థ్యం, దక్షత ఉన్నవాడు శివుడు. అంటే తన కంఠ భాగంలోని కొంత మేరకుతప్ప తనలో నిండి ఉన్న చతురశ భువనవాసులకు ఏవిధమైన ముప్పువాటిల్లకుండా - తన ఈ

సమస్త విశ్వ కుటుంబాన్ని రక్షించుకున్నవాడు శివుడు. ఇలా శివుని చేత జరిపించడానికి కారణం 'సర్వమంగళ' అయిన ఆయన భార్యే! అటువంటి 'శితికంఠుని భార్య' అని గుర్తుకు రావడం కోసం అమ్మవారిని ఇలా సంబోధించారు. శ్రీ లలితా సహస్రనామాల్లోని 'సదాశివ కుటుంబినీ' నామాన్ని ఇక్కడ గుర్తుకు తెచ్చుకోవాలి.

**భూరికుటుంబిని** : పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఉన్న ఈ విశ్వం యావత్తూ అమ్మవారి కుటుంబమే! "అటువంటి పెద్ద కుటుంబంలో – మచ్చ తెచ్చే, ముప్పుతెచ్చే – మహిషుని లాంటి వాడు ఉంటే – 'శ్రీమాతయే' గాక 'శ్రీమహారాజ్ఞీ' 'శ్రీమత్సింహాసనేశ్వరీ' గూడా అయిన అమ్మవారు ఊరుకుంటుందా ? వాడిపై తగిన చర్య తీసుకుని తన కుటుంబాన్ని చక్కదిద్దుతుంది గాని" అనే స్ఫురణ మనకు కలగడం కోసం అమ్మవారిని 'భూరికుటుంబిని' అని సంబోధించారు.

**భూరికృతే** : "అవతల శత్రువు ఎంత పెద్దవాడైనా, ఎంత దుర్మార్గుడైనా ఎంత బలగం కలవాడైనా అమ్మవారు – వాణ్ణి మట్టికరిపించి మటుమాయం చేయగలదు. ఇటువంటి అసాధ్యమైన మహత్తర కార్యాలు ఎన్నో అమ్మవారు చేసింది. మహిషుణ్ణి మర్దించడం ఓ లెక్కా ?" అనే సూచన, ఎంత అనుగ్రహాన్నైనా వర్షించగలదనే సూచన ఈ సంబోధనలో ఉన్నాయి. ఎందుకంటే – సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలనే పంచమహాకృత్యాలు ఆవిడ చేస్తుంది గాబట్టి. (శ్రీ లలితా సహస్ర నామాల్లోని 'పంచకృత్య పరాయణా' అనే నామం ఇక్కడ గుర్తుకు రావాలి.

**రమ్యకపర్దిని :** శిరస్సునందు ఉద్భవించే తపోమయములైన తేజః పుంజాలను జడలముడులు అనీ, కురులకూర్పు అనీ 'కపర్దినీ' పదంతో సంకేతిస్తారు. అమ్మవారి అలాంటి జటాజూటం 'అందంగా ఆహ్లాదకరంగా చూడ ముచ్చటగా ఉంటుంది' అని, ఎవరి కబరీబంధం చూస్తే - మన కర్మబంధాలు వీడిపోయి, మనకు జ్ఞాన సంపర్క భావాలు ఉద్భవిస్తాయో - ఆమె అమ్మవారు అనీ సూచించేందుకే శంకరులు అమ్మవారిని 'రమ్యకపర్దిని' అని సంబోధించారు. శ్రీ లలితా సహస్ర నామాల్లోని 'కపర్దినీ' నామం ఇక్కడ గుర్తుకు రావాలి.

**శైలసుతే :** మనలోని మదానికి సంకేతుడైన మహిషాసురుణ్ణి మర్దించే అమ్మవారిని 'శైలసుతే' అని సంబోధించడంలో చాలా ఔచిత్యం ఉంది. స్థిరత్వం, దృఢత్వం, విశాలత్వం, ఔన్నత్యం, వివిధ జీవరాసులకు ఔషధాలకు, జీవనదీ ప్రవాహాలకు చల్లని ఆశ్రయంగా ఉండటానికి - అనుగుణంగా ఉండే పేరెన్నికగలదే హిమశైలం. అటువంటి హిమశైలరాజుకు పుత్రిక అయిన అమ్మవారికి గూడా ఆ లక్షణాలు ఉంటాయి సుమా ! 'ఈ సల్లక్షణ, సంపన్నత్వంతోనే అమ్మవారు మహిషాసురుణ్ణి వధించి, ముల్లోకవాసులకు ముప్పు తప్పించి, ముదాన్ని చేకూర్చి 'కొండంత' అండగా నిలిచింది' అని ఈ సంబోధన సూచిస్తుంది. 'శైలేంద్రతనయా' అనే శ్రీ లలితా నామం ఈ సంబోధనకు దగ్గఱగా వుంటుంది.

శ్లో॥ సురవరవర్షిణి ! దుర్ధర ధర్షిణి ! దుర్ముఖమర్షిణి ! హర్షరతే !
త్రిభువన పోషిణి ! శంకరతోషిణి ! కల్మషమోచని ఘోరరతే !
దనుజవిరోషిణి ! దుర్మదశోషిణి ! దుఃఖవినాశిని ! సింధుసుతే !
జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 2

## అర్థము

సుర = దేవతలకు, వర = వరములను, వర్షిణి = వర్షించుదానా!, దుర్ధర = దుర్ధరుని లేదా ధరించుటకు శక్యము గాని వారిని, ధర్షిణి = గట్టిగా ఎదుర్కొనుదానా!, దుర్ముఖ = దుర్ముఖుని లేదా దుర్భాషలాడు వారిని, మర్షిణి = సహించు దానా !, హర్షరతే = ఆనందమునందు క్రీడాసక్తి కలదానా !, త్రిభువన = ముల్లోకములను, పోషిణి = పోషించుదానా !, శంకర = శివుని, తోషిణి = సంతోషపరచుదానా !, కల్మష = పాపములను, మోచని = పోగొట్టుదానా !, ఘోరరతే = భయము గొలిపెడి క్రీడలో ఆసక్తి కలదానా !, దనుజ = రాక్షసులను, విరోషిణి = మిక్కుటమైన రోషముతో మిక్కిలిగా హింసించుదానా !, దుర్మద = దురహంకారమదాంధులను, శోషిణి = అణగద్రొక్కుదానా, దుఃఖవినాశిని = దుఃఖమును పోగొట్టుదానా !, సింధుసుతే = సముద్రపుత్రికా !, హేమహిషాసురమర్దిని = ఓ మహిషాసురమర్దినీ!, జయ జయ = (నీకు) జయపరంపర అగుగాక ! ('రమ్యకపర్దిని', 'శైలసుతే' పదములకు మొదటి శ్లోకములో చెప్పబడిన అర్థములనే ఇక నుండి ప్రతిశ్లోకమునకు గ్రహించవలెను).

## తాత్పర్యము

ఓ మహిషాసురమర్దినీ ! దేవతలకు వరాలను కురిపించుదానా! భరించుటకు శక్యము కాని వారిని సైతము గట్టిగా ఎదుర్కొనగలదానా! దుర్భాషలాడు వారి పట్ల తొందరపడక ఓర్మి వహించుదానా ! ఆనందమునందు క్రీడాసక్తి కలదానా ! ముల్లోకవాసులను పోషించి కాపాడుదానా ! శివునికి ముదముచేకూర్చుదానా ! పాపములను పోగొట్టుదానా ! భయము గొలిపెడు తాండవాది క్రీడలలో ఆసక్తి కలదానా! రాక్షసులను మిక్కుటమైన రోషముతో హెచ్చుగా హింసించుదానా ! దురహంకార దుర్మదాంధులను అణగ ద్రొక్కుదానా! దుఃఖములను పోగొట్టుదానా! సముద్రపుత్రికా ! నీకు జయపరంపర అగుగాక!

## విశేషాంశములు

**సురవరవర్షిణి :** అందరికీ వరాలిచ్చేది దేవతలైతే – ఆ దేవతలకు వరాలిచ్చేది అమ్మవారు. ఆ వరాలు గూడా ఏదో పొదుపుగా పీనాసితనంగా – రెండో మూడో కాదు. వరాలను వర్షింప చేస్తుంది – అని 'సురవరవర్షిణి' సంబోధన సూచిస్తుంది.

**దుర్ధరధర్షిణి :** ఈ శబ్దానికి – ధరించడానికి, భరించడానికి అనుభవించడానికి అతికష్టంగా ఉండేవారనే అర్థమే కాకుండా 'అతి కష్టంగా వుండే వాటిలో అన్నిటి కన్న మిన్న అయిన – 'ఋణ, జరా, మరణ, నరకాల'నే అర్థాలను కూడా చెప్పుకోవచ్చు. అమ్మవారు వాటిని కూడా

దూరం చేస్తుందని - ఈ సంబోధన సూచిస్తుంది. శ్రీ లలితా సహస్రనామాల్లోని 'సర్వవ్యాధి ప్రశమనీ' 'సర్వమృత్యు నివారిణీ' 'మృత్యుదారు కుఠారికా' 'దురాధర్షా' అనే నామాలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**దుర్ముఖమర్షిణి :** 'యుద్ధంలో పలాయనం చిత్తగించడం కంటె - మరణించడమే మేలు, కీర్తిదాయకము. వీరులైన వారికి అపకీర్తి మరణం కంటె దుఃఖకరమైనది' - అని చెప్పి మహిషుణ్ణి దేవిపై యుద్ధానికి ప్రేరేపించి సమర్థించినవాడు దుర్ముఖుడు. వీణ్ణి కూడా అమ్మవారు చంపి, వాడు కోరుకున్నట్లుగానే వాడు అపకీర్తి పాలుకాకుండా చేసింది.

'దుష్టులు', 'దుర్మార్గులు' వేరు - దుర్ముఖులు వేరు. ముఖంలోనే దుర్ముఖులు చెడ్డవారు గాని లోపల వీరికి సహజంగా దుష్టత్వం వుండదు. బయట వారి ప్రేరణ వల్ల, ప్రమేయం వల్ల, ప్రలోభం వల్ల మాత్రమే తాత్కాలికంగా దుష్టత్వాన్ని ముఖంలో కనబరుస్తూ ఉంటారు. 'దుర్భాషలాడేవార'నే అర్థం గూడా 'దుర్ముఖ' పదానికి చెల్లుతుంది. ఇటువంటి వారి పట్ల అమ్మవారు కొంచెం ఓర్పు వహించి వారివల్ల తాత్కాలికంగా వచ్చే ఇబ్బందులపట్ల కొంత సహనంగానే ఉండి, వారు మంచిగా మారితే ఊరుకుని, మారకపోతే మహీతలం నుంచి మాయం చేస్తుంది' - అనే సూచన ఈ 'దుర్ముఖమర్షిణి' సంబోధన సూచిస్తుంది.

**హర్షరతే :** ఆనంద క్రీడాత్మకంగా ఉండడం అంటే అమ్మవారికి ఇష్టం అని ఈ సంబోధన సూచిస్తుంది. సుఖదుఃఖాలకు, కష్టనష్టాలకు

అతీతంగా ఎప్పుడూ సంతోషంతో వుంటూ బిగువు లేకుండా ఆనందంగా జీవితాన్ని గడుపుతూ వుండే వారి పట్ల, వారి సంతోషం పట్ల అమ్మవారు ఎక్కువ మక్కువ కలిగి వుంటుందనే సూచన గూడా ఈ 'హర్షరతే' సంబోధనలో ఉన్నదని గ్రహించాలి.

**త్రిభువన పోషిణి :** ముల్లోకాలను, ముల్లోకవాసులను పోషించేది'అని ఈ సంబోధనకు ఒక అర్థం. 'త్రిభువనపావని' అయిన గంగానదిని పోషించేది గూడా అమ్మవారే అనే అర్థం ఈ త్రిభువన పోషిణి సంబోధనలో ఉన్నది. ఎందుకంటే – 'భువనము' అంటే 'ఆకాశము', 'లోకము', 'ఉదకము' అనే మూడు అర్థాలూ ఉన్నాయి. ఉదకమనే అర్థం తీసుకుంటే – త్రిభువనాల్లోను ప్రవహించగలిగిన ఉదకం గంగానదికి సంబంధించినదే ! స్వర్గలోకంలో 'వియద్గంగ'గా, మర్త్యలోకంలో 'మందాకిని'గా, పాతాళలోకంలో 'భోగవతి'గా గంగానది ప్రవహించి, ఆ మూడు లోకాలను పావనం చేసింది. ఇటువంటి త్రిభువన పావని అయిన గంగను గూడా పోషించేది అమ్మవారే అనే సూచన ఈ 'త్రిభువన పోషిణి' సంబోధనలో ఉన్నది.

**శంకరతోషిణి :** 'శివునికి సంతోషాన్ని కలుగచేసేది' అని ఈ సంబోధనకు సంక్షిప్తార్థం. కళ్యాణమై కాపరానికి వచ్చిన కాత్యాయని శివునివాసమైన శ్మశానవాటికలో తన పారాణి పాదాన్ని మోపవలసి వచ్చింది. అమ్మవారు – 'ప్రపంచ సృష్ట్యున్ముఖకారిణి' 'సృష్టిస్వరూపిణి'

కాబట్టి పునః సృష్టితో శుభానికి నాందీకారకు రాలైంది. "శం" అంటే 'శుభము', 'సుఖము', 'శాంతి' అని అర్థాలు. ఈ శుభ, సుఖ, శాంతులను పునః సృష్టి ద్వారా కలుగజేసేది గాబట్టి అమ్మవారు 'శాంభవీ' 'శాంకరీ' అయింది. ఈ శుభలక్షణాలు గల అమ్మవారు శివునికి అర్ధాంగి అయింది కాబట్టి శివుడు గూడా 'శంకరుడు' అంటే 'శుభ సుఖశాంతులను కలుగజేయువాడు' అయినాడు. తన సర్వమంగళ లక్షణంతో శివుణ్ణి ఈ విధంగా సంతోషపెట్టేది గాబట్టి అమ్మవారిని 'శంకరతోషిణి' అని శంకరులు సంబోధించారు. 'మందస్మితప్రభాజాలమజ్జత్కామేశ మానసా' అన్న శ్రీ లలితా నామాన్ని ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**కల్మషమోచని :** దోషాలనుండి, పాపాలనుండి మనలను విముక్తుల్ని చేసేది అమ్మవారు. కశ్మలాలు, కల్మషాలు, పాపాలు, పాతకాలు, మహాపాతకాలు ఇలాంటివి చాలా వుంటాయి. వీటన్నింటినీ పోగొట్టగల సామర్థ్యం అమ్మవారికే వుంటుంది. 'పాపనాశినీ' 'మహాపాతకనాశినీ' 'పాపారణ్య దవానలా' మొదలైన శ్రీ లలితానామాలు ఈ 'కల్మషమోచని' సంబోధనను ధృవపరుస్తాయి.

**ఘోరరతే :** 'ఘోరం' అంటే 'భయంకరం' అని అర్థం. 'రతి' అంటే ఆసక్తి అని అర్థం. 'దుష్టుల పట్ల , దుర్మార్గుల పట్ల రాక్షస ప్రవృత్తి గల వారి పట్ల భయంకరంగా కనబడి – వారిని బెదరగొట్టి, అదరగొట్టి, అణచి వెయ్యడంలో అమ్మవారు ఆసక్తిని చూపుతుంది' అని ఈ సంబోధనకు ఒక అర్థం.

'ఘోర' శబ్దం భయానికే కాకుండా శివునికి గూడా చెల్లుతుంది. శివునికి రెండు రూపాలు – ఒకటి 'ఘోరరూపం' రెండవది 'అఘోరరూపం'. ఈ విషయం మహన్యాసంలో "అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః" అని చెప్పబడుతుంది. భక్తులపాలిట, శిష్టుల పాలిట - అఘోరరూపం, దుష్టుల పాలిట - ఘోరరూపం శివుడు ప్రదర్శిస్తాడు. అందుకే – శివునికి గల ఈ రెండు రూపాలూ అమ్మవారికి ఇష్టం' అని ఈ సంబోధన తెలుపుతుంది.

ప్రళయకాలరుద్రునితో కరాళదంష్ట్రల కాళిక శృంగార రససంబంధమైన సరస సల్లాపాదులను ఊహిస్తే అవి గూడా భీకర సంగ్రామ రీతులనే గుర్తు చేయవచ్చు. ప్రళయ భయానకాన్ని స్ఫురింపజేసే ఆ కోలాహల ప్రౌఢ ప్రణయాన్ని ఉద్దేశించి – శంకరులు 'ఘోరరతే' అని అమ్మవారిని సంబోధించారు.

**దుర్మదశోషిణి :** 'దుష్టబుద్ధితో దుశ్చర్యలను చేస్తూ పేట్రేగి పోయే దుర్మదాంధీపూతచేతస్కులను అరికాళ్లతో అణగదొక్కుతుంది. అనే అర్థంలో 'దుర్మదశోషిణి' అని అమ్మవారిని సంబోధించారు. "మదనాశినీ" అనే శ్రీ లలితా నామం ఈ సంబోధనను సమర్థిస్తుంది.

**దుఃఖవినాశిని :** బాధలు రెండు రకాలు. 1. భౌతికము 2. మానసికము. 'భౌతికమైన దెబ్బలు రోగాలు, రొప్పులు వాటివల్ల కలిగే దుఃఖాన్నేగాక – ఈర్ష్య, అసూయ, స్వాతిశయాభిమాన అనుమానాలతో

మానసికమైన బాధలవల్ల కలిగే దుఃఖాలను గూడా అమ్మవారు పోగొడుతుంది' అని చెప్పడం కోసం అమ్మవారిని 'దుఃఖవినాశిని' అని సంబోధించారు. 'కష్టాలను తీర్చి దుఃఖాలను పోగొడుతుందని, సుఖాలను కలుగజేస్తుందని చెప్పే శ్రీ లలితానామాలైన 'దుఃఖహంత్రీ' 'సుఖప్రదా' నామాలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**సింధుసుతే :** 'సింధు' అంటే 'సింధునది' అని, 'సముద్రము' అని అర్థాలు చెప్పుకోవచ్చు. లక్ష్మీదేవిని 'క్షీరాబ్ధికన్య' అంటారు. 'ముగురమ్మల మూలపుటమ్మ' అయిన అమ్మవారి యొక్క ఒక అంశమే లక్ష్మిగా రూపొందిందని, అందుకే శ్రీ లలితా నామాల్లో 'మహాలక్ష్మి' నామం గూడా ఉందని చెప్పుకుంటే – ఈ మహాలక్ష్మి నామపరంగా అమ్మవారు గూడా క్షీరాబ్ధి సుతయే అవుతుంది – అని ఈ 'సింధుసుతే' సంబోధనకు ఇంకో అర్థాన్ని గూడా గ్రహించవచ్చును.

"సుధాసాగరమధ్యస్థా" అనే శ్రీ లలితానామాన్ని బట్టి అమ్మవారు సుధాసాగర మధ్యంలో ఉంటుంది కాబట్టి అమ్మవారిని 'సింధుసుతే' అని సంబోధించినా చెల్లుతుంది.

**శ్లో॥ అయి జగదంబ ! కదంబవనప్రియ వాసవిలాసిని ! వాసరతే !**
**శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగనిజాలయ మధ్యగతే !**
**మధుమధురే ! మధుకైతవభంజని ! కైటవ భంజని ! రాసరతే !**
**జయ జయ హే మహిషాసురమర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 3**

## అర్థము

అయి = ఓ (తల్లీ) !, జగదంబ = జగన్మాతా !, కదంబవన = కడిమి చెట్ల తోట అనెడు, ప్రియవాస = ఇష్టనివాసము నందు, విలాసిని = ఒప్పుదానా !, వాసరతే = వసతి, లేదా ఉపాధులను కూర్చుటలో ఆసక్తిగలదానా !, శిఖరి = పర్వతములలో, శిరోమణి = శ్రేష్ఠమైన, లేదా తలమానికమైన, తుంగ = ఎత్తయిన హిమాలయ శృంగ = శిఖరమనెడు, నిజాలయ = స్వంత నిలయమునందు, మధ్యగతే = మధ్య ఉండుదానా!, మధుమధురే = తేనెవలె మధురమైన దానా !, మధు = మద్యము, కైతవ = కపటము, జూదము (మొదలగు వ్యసనములను), భంజని = వదిలించుదానా !, కైటవ భంజని = కైటభుడను రాక్షసుని అణగద్రొక్కిన దానా !, రాసరతే = సార రసానుభూతి యందు ప్రీతిగలదానా !, హే మహిషాసురమర్దిని ! = ఓ మహిషాసురమర్దినీ! జయజయహే = నీకు విజయపరంపర అగుగాక !

## తాత్పర్యము

తల్లీ ! జగన్మాతా ! కడిమి చెట్ల తోటను నివాసముగా అలరారుదానా! వసించుటకు వీలగు ఉపాధులను కల్పించుటలో ఆసక్తి గలదానా ! పర్వతశ్రేష్ఠమైన హిమాలయ పర్వత శిఖరములపై నివసించుదానా ! తేనెవలె తీయనైన అనుభూతిని ప్రసాదించు స్వభావము గలదానా ! మద్యము, కపటము, జూదము మొదలగు వ్యసనములను

పోగొట్టుదానా ! మధుకైటభులను రాక్షసులను వధించినదానా! సారరసానుభూతియందు ప్రీతిగలదానా ! ఓ మహిషాసుర మర్దినీ ! నీకు విజయ పరంపర అగుగాక !

## విశేషాంశములు

**జగదంబ :** 'జ' అంటే పుట్టుతూ, 'గ' అంటే ముందుకు గమిస్తూ అనగా కొనసాగుతూ ఉండేదే 'జగత్తు'. ఇటువంటి లక్షణం గల జగత్తు ఉద్భవానికి, కొనసాగడానికి మూలకారణమైన తల్లిలాంటిది అని 'జగదంబ' సంబోధన సూచిస్తుంది. శ్రీ లలితానామల్లోని 'జగతీకందా', 'విశ్వగర్భా' వంటి నామాలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**కదంబవనప్రియవాసవిలాసిని:** కదంబవనం అంటే కడిమి చెట్లతోట. కడిమి పూలంటే అమ్మవారికి చాలా ఇష్టం. ఇంక కడిమి పూల తోట అంటే ఇంకా ఎంత ఇష్టంగా ఉంటుందో చెప్పలేం ! అందుకే అమ్మవారు తన రెండు చెవులపైన కడిమి పూలను కాదు ఏకంగా కడిమి పూల గుత్తులనే అలంకారంగా ధరిస్తుంది. ఈ విషయాన్ని వ్యాసుల వారు గూడా శ్రీ లలితా సహస్ర నామాల్లో 'కదంబ మంజరీ క్లుప్త కర్ణపూర మనోహరా !' అనే నామం ద్వారా సూచిస్తారు. కడిమి, తులసి, మారేడు – ఇవి లక్ష్మీప్రదమైన సకల శుభాలను కలుగజేస్తాయి. వీటిలో కడిమిపూలు అరుణారుణ వర్ణంలో ఉంటాయి కాబట్టి అమ్మవారికి అవంటే మరింత ప్రీతి. అటువంటి తన కిష్టమైన కడిమిపూల తోటలో విహరిస్తూ అమ్మవారు ఉంటుందని చెప్పడం కోసమే ప్రస్తుత సంబోధనతో

ఈ స్తోత్రంలోను, "నీపోపవనవతి" అని సౌందర్యలహరీ స్తోత్రంలోని 8వ శ్లోకంలోను – శంకరాచార్యుల వారు; 'కదంబవనవాసినీ' అని శ్రీ లలితా నామాల్లో – వ్యాసులవారు సూచించారు.

**వాసరతే :** "వాస" అనే పదం, (ని)వాసము, వస్త్రము అనే రెండు అర్థాలను సూచిస్తుంది. 'వాసము' అంటే వసతికి సంబంధించినది. జీవులు వసించడానికి వీలుగా వుండే దేహాదులను కల్పించడంలో సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారు చాలా ఆసక్తిని చూపిస్తుంది. జీవాంశగా పరమేశ్వరుడున్నా, ఆ జీవదేహం ప్రకృతి మాతకు సంబంధించినదే ! కాబట్టి, ఈ పనిని అమ్మవారే ఇష్టంగా చేస్తుంది. ఈ విధమైన అర్థాన్ని లేదా జీవునికి వస్త్రం లాంటిదే దేహం గాబట్టి జీవులకు దేహములనే వస్త్రాలు కల్పించడంలో ఆసక్తిని చూపునది అనే విధమైన అర్థాన్ని గూడా చెప్పుకోవచ్చును.

**శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగ నిజాలయ మధ్యగతే:** 'పర్వతాల్లో శ్రేష్ఠమైనది, అన్నిటి కంటె ఎత్తయినది అయిన హిమాలయ పర్వత శిఖరమనే తన నివాస మధ్యంలో ఉండేది' అని సామాన్యార్థం. కుండలినీ యోగపరంగా చెప్పుకుంటే – మన వెన్నెముకను మేరుదండము, బ్రహ్మాదండము, యోగదండము మొదలైన పేర్లతో సంకేతిస్తారు. మనదేశానికి ఉత్తరభాగంలో హిమాలయ పర్వత శిఖరాగ్రం ఉన్నట్లే – మనశరీరంలో మేరుదండం అని పిలువబడే వెన్నెముక పైన అగ్రం

ఉంటుంది. ఈ అగ్రాన్ని 'మేరుశృంగం' అంటారు. ఆ మేరు శృంగాగ్ర మధ్యంలోనే కుండలినీ శక్తి అనే అమ్మవారు ఉంటుందని 'సుమేరుశృంగమధ్యస్థా' అనే నామం శ్రీ లలితా సహస్రనామాల్లో చెప్పబడుతోంది. శ్రీ చక్ర ఉద్ధారం ('మేరువు' లేదా గోపురం లాగా ఉండే త్రిదిశాత్మక (Three Dimensional) శ్రీ చక్రం) పైన మధ్యగా వుండే బిందువు వద్ద అమ్మవారు ఉంటుంది. ఈ స్థానాన్నే బిందుస్థానమంటారు. అక్కడుండే అమ్మవారిని 'బైందవాసనా' అనే పేరుతో పిలుస్తారు. ప్రస్తుత సంబోధన ఈ విషయాలను స్ఫురణకు తెస్తుంది. ('శిఖరి' అంటే హిమాలయ శిఖరమనే అర్థాన్ని తీసుకుంటే – 'శిఖరి శిరోమణి' అంటే ఆ 'శిఖరంపై శిరోమణిలాగా భాసించేదానా' అని అమ్మవారిని సంబోధించినట్లు అర్థాన్ని తీసుకోవచ్చు. పర్వతానికి శిఖరం శిరోమణి అయితే – ఆ 'శిఖరానికి శిరోమణిలాగా అమ్మవారు ఉంటుందన్నమాట ! అంటే – హిమాలయ పర్వత శిఖరంపై అమ్మవారు నడుస్తున్నా, నర్తిస్తున్నా – ఆ శిఖర శిరస్సుకు మణిలాగా భాసిస్తూ 'నలుదిక్కులు' కాంతులు విరజిమ్ముతూ ఉంటుందని అర్థం).

**మధుమధురే :** పువ్వులలో ఉండే తేనెకు సంస్కృతంలో 'మధువు' 'మకరందము', 'మరందము' మొదలైన పేర్లున్నాయి. తీపి – 'తృప్తి'ని 'హాయి'ని సూచిస్తుంది. అమ్మవారి రూపంగాని, సాన్నిధ్యం గాని, హాసం గాని, భాషణ గాని, చూపులు గాని – మధురాతి మధురంగా ఉంటాయి. అందుకనే శ్రీ లలితా సహస్ర నామాల్లో గూడా అమ్మవారికి 'మధుమతీ'

'స్వభావమధురా' అనే నామాలు చెప్పారు. అంటే అమ్మవారి స్వభావం (నైజగుణం) అంటే 'సహజప్రకృతి' – అంత ఆహ్లాదకరంగా ఉంటుందని అర్థం.

**మధుకైతవ భంజని :** ఈ సంబోధన లోని 'మధు' పదం 'తేనె' అనే అర్థాన్ని గాక 'మద్యము' అనే అర్థాన్ని సూచిస్తుంది. 'కైతవము' అంటే – 'కపటము', 'జూదము' మొదలైన వ్యసనాలను సూచిస్తుంది. ఈ 'వ్యసనాలను పోగొట్టేది' అనే అర్థంలో 'మధుకైతవ భంజని' అని సంబోధించారు.

**కైటభభంజని :** పూర్వం మధువు, కైటభుడు అనే ఇద్దరు రాక్షసులను విష్ణువు సంహరించాల్సి వచ్చింది. ఎంతకూ వారిద్దరూ హతులు కాకపోవడంతో విష్ణుమూర్తి అమ్మవారిని స్తుతించి ప్రార్థించాడు. అప్పుడు అమ్మవారు విష్ణు ప్రార్థనను ఆలకించి, అనుగ్రహించి రాక్షసులకు మోహావేశం క్రమ్మేట్లు చేసింది. ఈ విధంగా మధుకైటభుల వధకు పరోక్షంగా అమ్మవారే కారణం అనే విషయం ఈ సంబోధన ద్వారా శంకరులు సూచన ప్రాయంగా తెలిపారు.

**రాసరతే :** 'రసము' అంటే 'సారము' (Essence) అని అర్థం. సమస్త విశ్వానికి సారభూతమైనది అమ్మవారు. సమస్త కళలలో, క్రీడలలో, కార్యకలాపాల్లో ఉండే – ఆనంద స్పర్శానుభూతినే 'రసానుభూతి' అంటారు. ఇటువంటి రసానుభూతితో యావత్ప్రపంచాన్ని పాలించడం అమ్మవారికి

ఇష్టం' అని చెప్పడం కోసం 'రాసరతే' అని సంబోధించారు. తైత్తిరీయోపనిషత్తు గూడా "రసోవైసః" అని పరమాత్మను గుఱించి ప్రతిపాదిస్తుంది. 'రస్యా', 'రసజ్ఞా' 'రసశేవధిః' అన్న శ్రీ లలితా నామాలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**శ్లో॥ అయి నిజహుంకృతి మాతృ నిరాకృతి ధూమ్రవిలోచని ! ధూమ్రశిఖే !**
**సమర విశోణిత బీజసముద్భవ బీజలతాధిక బీజలతే !**
**శివ ! శివ! శుంభ నిశుంభ మహాహవ తర్పిత భూత పిశాచ-పతే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే ! 4**

## అర్థము

అయి = ఓ (తల్లీ!), నిజహుంకృతి = తన హుంకారముతో, మాతృనిరాకృతి = బ్రాహ్మీమాహేశ్వర్యాది సప్తమాతృకలను నిరాకరించుట యందు, ధూమ్ర = (నలుపు ఎఱుపు కలిసిన) పొగ రంగు గల, విలోచని = కన్నులు గలదానా !, ధూమ్రశిఖే = పొగరంగును కలిగిన కురుల కూర్పు కలదానా !, సమర = రణరంగములో, విశోణిత బీజ = రక్తబీజుడను రాక్షసుని వలన, సముద్భవ = ఏర్పడిన, బీజలతా = తీగవలె వ్యాపించు బీజశక్తి కంటె, అధిక = ఎక్కువైన, బీజలతే ! = శక్తి చేత లతవలె నిర్బంధించుదానా !, శివ ! శివ ! = ఓ పరమేశ్వర, శుంభ - నిశుంభ = శుంభుడు నిశుంభుడు అను రాక్షసులతోడి, మహా + ఆహవ = గొప్ప యుద్ధము నందు, తర్పిత = తృప్తిపరచబడిన, భూత

పిశాచపతే = భూత పిశాచ గణముల అధిపతులను కలిగిన దానా !, హే మహిషాసురమర్దిని = ఓ మహిషాసురమర్దినీ, (నీకు), జయజయ = జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

హుంకారముతో సప్తమాతృకలను నిరాకరించు సంరంభ సందర్భంలో ధూమ్రవర్ణముగా మారిన కనులు కలదానా ! పొగరంగులో కనిపించు కురుల శిఖావిజృంభణము గలదానా ! రక్త బీజుడను రాక్షసుని వలన ఏర్పడిన తీగవలె వ్యాపించు బీజశక్తి కంటె అధికమైన శక్తిచే వానిని నిర్బంధించి హతమార్చినదానా ! శుంభ, నిశుంభులతో జరిగిన యుద్ధములో భూత పిశాచ గణములకు రక్త తర్పణము చేసినదానా ! ఓమహిషాసుర మర్దినీ ! నీకు జయపరంపర అగుగాక!

## విశేషాంశములు

**నిజహుంకృతి :** చిన్నవారిమీద, లోకువైన వారిమీద, తిరిగి ఏమీచెయ్యలేని వారి మీద ప్రతివారూ హుంకరిస్తారు. అసలు ఈ హుంకారం ఎలా వస్తుంది ? లోపల వున్న కోపోద్వేగాలను ఒక్కసారిగా వ్యక్తం చెయ్యడానికి చేసే ప్రయత్నంలో వచ్చేది 'హుంకారం'. తప్పనిసరిగా ఈ హుంకారం గట్టినిశ్వాసాన్ని అనుసరించి రావల్సిందే ! ఈ నిశ్వాసము 'హ' కార సంబంధమైంది, ఉచ్ఛ్వాసం 'స' కార సంబంధమైంది – అని

మనలో జరిగే 'సోऽహం' అనే అజపాగాయత్రీమంత్రం తెలుపుతుంది. ఉచ్ఛ్వాసం – అయ్యవారికి, నిశ్వాసం – అమ్మవారికి సంబంధించినవిగా సంకేతిస్తారు. అంటే ఎవరు నిశ్వాసం చేస్తున్నా ఈ 'హ' కారం వస్తుంది. లోపల నుండి బయటకు వెడలే నాదం స్వరపేటికల మధ్య రాపిడికి గురి ఔతుంది. ఈ రాపిడినే 'రేఫ' మని సంకేతిస్తారు. రాపిడికి గురి అవగా వచ్చే నిశ్వాస 'హ' కారం – 'హ్ర' కారమౌతుంది. ఈ 'హ్ర'కారం బయటకు వేగంగా వెలువడాలంటే కొంత శక్తి కావాలి. ఈ శక్తికి సంబంధించిన బీజాన్ని "ఈం"తో సంకేతిస్తారు. ముందు తెల్పిన 'హ్ర' కారం ఈ 'ఈం' కారంతో కలసి బయటకు 'హ్రీం'కారం లాగా వ్యక్తమౌతుంది. ఈ 'హ్రీం'కారాన్ని 'శక్తి బీజం' అంటారు. ఎవరు హుంకరించాలన్నా అమ్మవారికి సంబంధించిన ఈ 'హ్రీం' కార సహకారం ఉండాల్సిందే ! అమ్మవారే హుంకరించాల్సి వస్తే ఆవిడ తన స్వంత హ్రీంకారాన్నే ఉపయోగించుకుంటుందన్నమాటే గదా ! "నిజహుంకృతి" అనే సంబోధనలో ఇంతటి విపులమైన మంత్రశాస్త్ర జ్ఞానం నిక్షిప్తమై వుందని గ్రహించవచ్చు.

**మాతృనిరాకృతి:** అమ్మవారి హుంకారం మాతృకలను నిరాకరిస్తోందిట ! ఈ మాతృకలెవరు? శివునికి పరిచర్యలు చేసే శక్తులు ఏడుగురుంటారు. ఈ ఏడుగురిని 'సప్తమాతృక' లంటారు. వీరి పేర్లు బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ, చాముండా. "యుద్ధ సంరంభంలో కోపోద్వేగాలతో అమ్మవారు

హుంకారాలు చేస్తూ వున్నపుడు దగ్గఱలో వున్న ఈ సప్తమాతృకలు భయభక్తులతో దూరంగా తొలగిపోయారు" - అనే విషయాన్ని ఈ పదప్రయోగంతో తెలియపరిచారు.

**ధూమ్రవిలోచని :** అమ్మవారు హుంకరించేటప్పుడు ఆవిడముఖంలో చాలా మార్పులు వచ్చాయిట. ముఖ్యంగా కళ్లు ధూమ్రవర్ణంలోకి మారిపోయాయిట! ఆ కళ్లు విశాలంగా తీక్షణంగా కొనలుదేరి చూపులు కోసుకునేట్లున్నాయిట ! ఎలాంటి వారైనా ఆ ముఖాన్ని, కళ్ళను చూచి భయభ్రాంతులతో తొట్రుపాటు పడాల్సిందేనట ! ఆ నేత్రాలు నల్లని పొగరంగులో - అంటే ఎఱుపు నలుపు రంగులు కలిసిన వర్ణంలో వున్నాయిట ! ఈ రంగుల్లో ఎఱుపు రజోగుణాన్ని, అంటే రాజసాన్ని, నలుపు తమోగుణాన్ని తద్వారా తామసశక్తిని సూచిస్తాయి. ఈ రెండు గుణాలు యుద్ధం చేసే వారికి చాలా అవసరం అని సూచించడానికే ఇలా సంబోధించారు.

**ధూమ్రశిఖే :** యుద్ధ సంరంభంలో అమ్మవారి కళ్లు మాత్రమే కాదు - జడలు గూడా పొగరంగులోనే వుండి, అక్కడక్కడ రేగుతున్న కురులు గూడా పొగ తీగల లాగా వున్నట్లుగాను; తమోగుణ ప్రధానులైన రాక్షసులందరినీ తన కేశపాశంలో బంధించిందా అన్నట్లు - అమ్మవారి వేణీబంధం, రేగిన కురుల తీరు ఉన్నట్లుగానూ - ఈ సంబోధనను బట్టి ఊహించుకోవాలి.

**సమరవిశోణిత బీజసముద్భవబీజలతాధిక బీజలతే :** ఈ సంబోధనా పద సంచయంలో పురాణ గాథ ఉంది. భీకరమైన సంగ్రామంలో అమ్మవారి అవక్రవిక్రమ పరాక్రమానికి అసురుల నెత్తురు ఏరులై పారుతోంది. యుద్ధం చేస్తున్న అసురవీరులలో రక్తబీజుడు ఒక విచిత్రమైన శక్తిగలవాడు. తన శరీరంలోంచి ఒక్క రక్తబిందువు భూమిమీద పడినా వెంటనే ఆ బిందువు నుండి మళ్ళీ ఒక రాక్షసుడు పుట్టుకొస్తాడు. ఈ శక్తితోనే వాడు దెబ్బలకు, దెబ్బలాటలకు, యుద్ధాలకు భయపడడు. ఎవ్వరినీ లెక్కచెయ్యకుండా పేట్రేగిపోతూ, విర్రవీగిపోతూ స్వైరవిహారం చేస్తాడు. ఈ రహస్యంతెలిసిన అమ్మవారిలోంచి ఒక కాళికా రూపం వచ్చి, కరాళముఖాన్ని ఆకాశ గుహలాగా పెంచి తన నాలుకను భూమి అంత విశాలంగా చేసింది. రక్తబీజునితో యుద్ధం చేస్తున్నప్పుడు రక్తబీజుడి శరీరం నుండి చిందిన రక్తపు బిందువు గూడా నేలమీదపడకుండా తన విశాలమైన నాలుకను అడ్డుపెట్టి త్రాగివేసింది. రక్తబీజుని రక్తమంతా త్రాగి వెయ్యడంతో రక్తబీజుడు గత్యంతరం లేక మళ్ళీ పుట్టకుండా మరణించాడు. దేవీ భాగవతంలోని ఈ కథను ఈ 'సమరవిశోణిత .... బీజలతే!' అన్న సంబోధనలో శంకరులు నిక్షిప్తం చేశారు.

మన దుశ్చర్యలు, దురాగతాలు, వ్యభిచారాది దుష్ప్రవర్తనల వల్ల వచ్చే దోషాలన్నీ రక్తంలో బీజప్రాయంగా పునఃపునః ఉద్భవిస్తూనే వుంటాయి. మనలోని ఈ దోషాన్ని రక్తబీజుడితో సంకేతిస్తారు. రక్తపు చివరిబొట్టు దాకా ఈ దోషాంకురం బీజప్రాయంలో వుంటుంది.

సమూలంగా ఈ దోషం నివారణ కావాలంటే - అమ్మవారి అనుగ్రహం వల్లనే సాధ్యం. ఈ రక్తదోషాన్ని చివరిదాకా పీల్చి మనలోని రక్తబీజుణ్ణి అంతం చేస్తుంది అమ్మవారు. ఈ కథలోని ఈ అంతరార్థాన్ని గూడా అసలు కథతో పాటు గ్రహించాలి. రాక్షసరాజు దనువు కొడుకు రంభుడైతే ఆ రంభుని కొడుకు మహిషాసురుడు. మళ్లీ పుత్రవాత్సల్యంతో రంభుడే రక్తబీజుడుగా జన్మిస్తాడు. వంశపారంపర్యంగా వచ్చే రక్తదోషానికి రక్తబీజుడు సంకేతుడన్న విషయం ఈ రక్తబీజుడి జన్మవృత్తాంతం నిర్ధారిస్తుంది.

**శివ ! శివ ! :** రుద్రుడు రుద్రభూమి అయిన శ్మశానంలో ఉంటాడు. ఆ వల్లకాటిలోని బూడిదను వంటికి పూసుకుంటాడు. గజచర్మాన్ని వస్త్రంగా ధరిస్తాడు. బుసలుకొట్టే పాముల్ని కంటిపై ఆభరణాలుగా ధరిస్తాడు. ఇలా వేటిని చూసినా ఆయన దగ్గర అమంగళకరమైన, జుగుప్సాకరమైనవే కనిపిస్తాయి, - ఆయన అమంగళకరమైన వాడుగానే అనిపిస్తాడు. 'సర్వమంగళ' అయిన అమ్మవారితో పెళ్లై అమ్మవారు కాపరానికి రాగానే - అమంగళకరమైన శ్మశానవాతావరణం సర్వమంగళకరమై, రుద్రుడు గూడా మంగళకరుడై శివుడైనాడు. అంటే అమ్మవారు రుద్రుణ్ణి 'శివుని' గాను 'శివతరుని' గాను చేసిందన్నమాట ! శివుని యొక్క ఆ మంగళ స్వరూపం అమ్మవారే ! అమ్మవారికి శివునికి భేదం లేదు

కాబట్టి. అమ్మవారిని గూడా ఈ శ్లోకంలో శివ ! శివ! అని సంబోధించారు.

**శుంభనిశుంభ మహాహవతర్పిత భూతపిశాచ-పతే :** తమను ఆశ్రయించుకుని సేవించుకునే రక్తబీజుడు అమ్మవారి చేత హతుడయాడని తెలిసి శుంభ నిశుంభులు అమ్మవారిపై యుద్ధానికి దిగారు. అమ్మవారు విజృంభించి యుద్ధంలో మహాభీకరమైన వాతావరణాన్ని సృష్టించింది. భూతపిశాచాల ఆనందానికి లోటు లేకుండా యుద్ధం జరిగింది. ఎక్కడ చూచినా తలలు తెగిన అసురుల మొండాలు, చేతులు కాళ్లు లేని రక్కసుల మొండాలు, బంతుల్లాగా దొర్లుతూ ఉండే దనుజుల తలకాయలు, నెత్తురు ప్రవాహాలు, శవాలను పీక్కుతినే గ్రద్దలు రాబందుల గుంపులు, నక్కకూతలు. ఇవన్నీ ఎవరికి ఎలా కనబడినా, ఎలా వున్నా భూత పిశాచాలకు మాత్రం వాటిక్కావలసినవి దక్కడంతో రక్తమాంస సంతర్పణ జరిగినట్లు మహా సంతృప్తిని చెందాయి. ఈ విధంగా భూత పిశాచగణాలకు సంతృప్తి కలగడానికి కారణభూతురాలైన అమ్మవారికి జయం జయం అంటూ శ్లోకాన్ని ముగించారు.

**శ్లో॥ అయి భో శతముఖ ఖండిత కుండలి తుండిత ముండ గజాధిపతే !**
**రిపు గజగండ విదారణ ఖండ పరాక్రమ శౌండ మృగాధిపతే !**
**నిజ భుజదండ నిపాతిత చండ నిపాతిత ముండ భటాధిపతే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 5**

## అర్థము

అయి భో = ఓ (తల్లీ), శతముఖ = ఇంద్రునిచేత, ఖండిత = ఖండించబడిన, కుండలి = సర్పములను, తుండిత = చీల్చబడిన, ముండ = తలలను కలిగిన, గజాధిపతే = గజరాజులను కలిగిన దానా!, రిపు = శత్రువుల యొక్క, గజ = ఏనుగుల యొక్క, గండ = చెక్కిళ్లను, విదారణ = చీల్చుటయందు, ఖండ పరాక్రమ = ఖండించెడు శక్తి యందును, శౌండ = మదోద్రేకము కలిగిన, మృగాధిపతే = సింహమును కలిగిన దానా !, నిజభుజదండ = తన భుజదండముచే, నిపాతిత = పడగొట్టబడిన వారు, చండ = భయంకరులు, నిపాతిత ముండ = నేలకొరిగిన తలలు కలవారును అయిన, భటాధిపతే = శత్రు సేనాధిపతులను కలిగిన దానా !, హే మహిషాసుర మర్దిని = ఓ మహిషాసుర మర్దినీ, జయ జయ = (నీకు) జయపరంపర అగు గాక!

## తాత్పర్యము

మహిషాసురాది అసురులతోడి యుద్ధంలో·ఇంద్రాదులు రకరకాల ఆయుధాలతో దేవిని అనుసరిస్తూ – ఎదురుగా వచ్చే అసురుల యొక్క ఏనుగులతలలను ఖండిస్తూ, వాళ్లు ప్రయోగించే భయంకర విషసర్పాలను ముక్కలు ముక్కలు చేస్తూ ముందుకు సాగుతున్నారు. అమ్మవారి వాహనమైన సింహము – శత్రువుల మదపు టేనుగుల గండస్థలాలను చీల్చివేయడంలో అమితమైన ఉద్రేకాన్ని ఉక్రోషాన్ని ప్రదర్శిస్తోంది.

భుజదండంతో, అమితమైన క్రోధంతో  అమ్మవారు ఉరికి, శత్రు సేనాధిపతుల తలలను ఖండించగా అవి నేలకొరిగిపోయాయి. అటువంటి మహిషాసుర మర్దినికి  జయమగుగాక!

## విశేషాంశములు

ఈ స్తోత్రంలోని అన్ని శ్లోకాల శబ్దాలు ఒక ప్రత్యేకమైన అనురవంతో ఉండి, వింటూంటే ఒక విధమైన ఊపు వస్తుంది. 'కవిరాజవిరాజితం' అనే ఛందస్సులో నడిచే ఈ శ్లోకాలలో ప్రస్తుత శ్లోకం మరింత ప్రాముఖ్యమైంది. ఈ శ్లోకంలో ఇంద్రాదులు అసురుల పైకి విజృంభించి, అమ్మవారు చేసే యుద్ధవాతావరణం కళ్ళకు కట్టినట్లుంటుంది. బిందుపూర్వక దకార విన్యాసంతో శ్లోకంలోని ప్రతిపాదం భీభత్సరసాన్ని ముంచెత్తుతుంది. యుద్ధ వివరాల కథాగమనంతో పాటు కొన్ని ఆధ్యాత్మిక రహస్యాలు గూడా ఈ శ్లోకంలో ఉన్నాయి.

**శతముఖ ఖండిత కుండలి :** శతముఖుడంటే ఇంద్రుడు. ఇంద్రియాలకు అధిపతి అయిన 'మనస్సు'ను ఇంద్రునిచే సంకేతిస్తారు. 'కుండలి' అన్నపదం సర్పాన్నే గాక 'కుండలినీ పథాన్ని' గూడా సూచిస్తుంది. అంటే మనవెన్నుపాము లోని సుషుమ్నా నాడీ మార్గాన్ని సూచిస్తుంది. బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథుల విభేదనం జరిగిన తర్వాత గాని యోగసాధనలో షట్చక్రాలను దాటి, సహస్రార కమలాన్ని చేరడం సాధ్యం కాదు. అంటే - వెన్నుపాము వెంబడి మూడు చోట్ల జరిగే గ్రంథి

విభేదన ప్రక్రియనే "ఖండితకుండలి" పద ప్రయోగం ద్వారా సూచించినట్లు గ్రహించవచ్చును. (శ్రీ లలితా సహస్రనామాల్లోని 'బ్రహ్మగ్రంథి విభేదినీ', 'విష్ణుగ్రంథి విభేదినీ', 'రుద్రగ్రంథి విభేదినీ' మొదలైన నామాలు ఇక్కడ గుర్తుకు రావాలి.

'కుండలి' అంటే చుట్టలు చుట్టుకొన్న పాముగా అర్ధం చేసుకుంటే ఆ పదానికి 'వృత్రాసురుని'గా అర్ధం చెప్పుకోవాలి. వృత్రాసురుడు అహంకారానికి గుర్తు కాబట్టి అహంకార నిర్మూలనను గూడా 'ఖండితకుండలి' పదప్రయోగం సూచిస్తుంది.

**రిపుగజగండవిదారణ :** ఎవరి సైన్యంలో అయినా చతురంగబలాలు ఉంటాయి. అవే – 'గజ, తురగ, రథ, పదాతి' బలాలు. ముందుగా గజాల గురించి అంటే ఏనుగుల గురించి ఈ శ్లోకంలో చెప్పబడుతోంది.

అమ్మవారు ధరించిన అంకుశంలోంచి సంపత్కరీ దేవి పుట్టింది. శబ్దస్పర్శ రూపరస గంధ తన్మాత్రల వలన చిత్తవృత్తులు ఏర్పడతాయి. ఈ శబ్దాది విషయాలనే 'సింధురవ్రజము' అంటే 'ఏనుగుల సముదాయంగా' గుర్తిస్తారు. అమ్మవారి అంకుశంలోంచి పుట్టిన సంపత్కరీ దేవి ఈ సింధుర వ్రజాన్ని అదుపులో పెట్టగలదిట్ట. ఈ విషయం ఈ శ్లోకంలో గజ సంహార ప్రక్రియ ద్వారా చెప్పబడినట్లు గ్రహించవచ్చును. శ్రీ లలితా సహస్రనామాల్లోని 'సంపత్కరీ సమారూఢ సింధురవ్రజ సేవితా' అనే నామార్థాన్ని గూడ ఇక్కడ చదువుకుని సమన్వయించుకోవచ్చును.

**శౌండ మృగాధిపతే :** అమ్మవారు సింహాన్ని అధివసించి వుంటుంది. ఈ సింహం – రాశి చక్రంలో – సింహరాశిని, మనలో – ఆ సింహరాశి సూచించే హృదయాన్ని తెలుపుతుంది. మన హృదయం అనాహత చక్రస్థానానికి నిలయం. అమ్మవారు సింహాసనం ఎక్కడం అంటే – 'మనలో హృదయాన్ని, ఆ హృదయంలోని అనాహత చక్రాన్ని అధివసించడం' అని అర్థం. ఈ అనాహత చక్రం – సుషుమ్నాపథంలో క్రింద వున్న 'మూలాధార' 'స్వాధిష్ఠాన', 'మణిపూర' చక్రాలకు; పైన వున్న 'విశుద్ధి', 'ఆజ్ఞ' 'సహస్రార చక్రాల'కు – మధ్య కేంద్రం లాగా వుంటుంది. హృదయ స్పందన, శ్వాసకోశాల సంకోచ వ్యాకోచాలు, రక్తప్రసరణ ఇత్యాదులన్నీ ఈ కేంద్ర నిర్వహణ లోకే వస్తాయి. అలాగే అమ్మవారే అన్ని రకాల జీవ సంబంధమైన ప్రక్రియలను నిర్వహిస్తుంది. రక్త దోషాలే అసురులు చేసే అకృత్యాలు. హృదయం వద్దనే చెడ్డ రక్తం మంచిరక్తంగామారి, రక్తదోషాలు నివారింపబడతాయి. అంటే హృదయ సింహాసనా రూఢియైన అమ్మవారి ద్వారా అసురుల అకృత్యాలకు పరిష్కారం జరుగుతోందని ఈ శ్లోకంలో సమన్వయాత్మకంగా చెప్పబడింది.

**నిజభుజదండనిఫాతిత చండనిపాతిత ముండ భటాధిపతే :** అమ్మవారి భుజదండం చేత జయింపబడి, భయంకరమైన శత్రు సైన్యాధిపతులు తలలు తెగి నేలకొరిగారు అని ఈ పద ప్రయోగానికి బాహ్యార్థం. ఈ సంబోధనా పదాల్లో – 'భుజ' పదం అమ్మవారి భౌతిక బలాన్ని, దండపదం యోగదండాన్ని (కుండలినీ శక్తిని) తద్వారా యోగశక్తిని, 'ముండ' పదం ముండాసురాది అసురులను సూచిస్తాయని గ్రహించాలి.

(రాక్షసవీరులు శుంభ నిశుంభులు ఇద్దరూ అన్నదమ్ములు. వీరి సేనానులు అమ్మవారి అందానికి మోహమూర్ఛితులై, తమ ప్రభువైన - శుంభునికి తెలియపరచి, ఆమెను వివాహం చేసుకొని తరించవలసినదిగా ప్రేరేపిస్తారు. సుగ్రీవుడనే వాడు దూతగా అమ్మవారి దగ్గఱకు వెళ్లి విషయాన్ని ప్రస్తావిస్తే - అమ్మవారు యుద్ధం చేసి గెల్చుకొమ్మని కబురు పెడుతుంది – అప్పుడు శుంభుడు, 'ధూమ్రలోచనుడ'నే వాణ్ణి కార్యాన్ని సాధించుకుమ్మని ఆజ్ఞాపిస్తాడు. యుద్ధంలో వాడు అమ్మవారి చేత హతుడౌతాడు. అప్పుడు శుంభుడు 'చండ ముండుల'నే ఈ రాక్షస సోదరులను యుద్ధానికి పంపుతాడు. వాళ్ళు దేవికి ఎదురుగా నిలబడి యుద్ధం ప్రారంభిస్తే అమ్మవారి యోగశక్తిగా కాళిక ఉద్భవిస్తుంది. కాళిక కరాళదంష్ట్రలతో, ముండమాలతో, భైరవిలాగా మహాకాయంతో వచ్చి, తన ముఖ గహ్వరం లోనికి వేలకొలది గజాలను, అశ్వాలను, ఒంటెలను, దానవులను గ్రహించి నములుతూ చండముండులను పాశాలతో బంధించి, అమ్మవారి ముందు ఉంచుతుంది. అమ్మవారు 'పశువులపై' కరుణ ఏమిటి ? అనగానే ఖడ్గంతో వారిద్దరి తలల్ని కాళిక నరుకుతుంది. అప్పటి నుండి కాళికను 'చాముండి'గా ప్రఖ్యాతి వహించమని అమ్మవారు శ్లాఘిస్తుంది. రాక్షస సేనానులైన చండముండ వధకూడా ఇక్కడ గుర్తుచేసుకోవాలి. ఇది దేవీభాగవత కథ.)

శ్లో॥ హయరణ మర్మర శాత్రవ దోర్ధుర దుర్జయ నిర్జర శక్తిభృతే !
చతుర విచార ధురీణ మహాశివదూతకృత ప్రమథాధిపతే !
దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత దురంతగతే !
జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 6

## అర్థము

హయరణ = గుఱ్ఱములతో జరుగు యుద్ధమునందు, మర్మర = వంటిపై లోహ కవచాదుల మరమర ధ్వనులు గలిగిన, శాత్రవ = శత్రువుల యొక్క, దోర్ధర = బాహుబలముచేత, దుర్జయ = జయింపశక్యము గాని, నిర్జర = దేవతలయొక్క, శక్తి = శక్తులచేత, భృతే = భరింపబడిన దానా ! (వెంటకలిగినదానా), చతుర = నైపుణ్యము కలిగిన, విచార = ఊహారచన యందు, ధురీణ = గొప్పవాడైన, మహాశివ = మహేశ్వరుని చేత, దూతకృత = దూతలుగా చేయబడిన, ప్రమథాధిపతే = ప్రమథగణాధిపతులను కలిగిన దానా !, దురిత = పాపసంబంధమైన, దురీహ = దుష్టములైన కోరికలు గల, దురాశయ = దుష్టములైన ఆశయములు గల, దుర్మద = దురభిమానము గల, దానవ = రాక్షసుల యొక్క, దూత = దూతలయొక్క, దురంత = వినాశనమునకు, గతే = కారణమైన దానా!, హే మహిషాసురమర్దిని = మహిషాసురుని మర్దించిన దానా !, జయజయ = నీకు జయ పరంపర అగుగాక !

## తాత్పర్యము

గుఱ్ఱములతో జరుగు యుద్ధమునందు లోహ, కవచ, ఖడ్గ, శూలాదుల మరమరధ్వనుల మధ్య - శత్రురాక్షసుల బాహుబలమునకు లొంగని, జయింప వీలులేని దేవతాశక్తులను కలిగినదానా ! గొప్పశక్తియుక్తులు గల శివుని యొక్క ప్రమాథాధిపతులను వెంట కలిగిన దానా! పాపభూయిష్టమైన, దుష్టమైన ఆశలతో, ఆశయాలతో దుర్మదాంధులై విజృంభించు రాక్షసుల వినాశనమునకు కారణమైనదానా! ఓ మహిషాసుర మర్దినీ ! నీకు జయ పరంపర అగుగాక !

## విశేషాంశములు

**హయరణమర్మరశాత్రవ** : గజ, తురగ, రథ, పదాతి బలాలను చతురంగ బలాలు అంటారు. క్రిందటి శ్లోకంలో ఏనుగులతో యుద్ధం చెప్పబడింది. గుఱ్ఱాలతో యుద్ధం సంగతి ఈ శ్లోకంలో చెప్పబడుతోంది. గుఱ్ఱాలు ఉధృతమైన వేగాలకు పెట్టింది పేరు. ఈ అశ్వయుద్ధం చాలా ఉద్వేగంగా, ఉధృతంగా ఉంటుంది. యుద్ధవీరులు కూడా ఆ వేగానికి తగ్గట్లుగానే యుద్ధం చేయగలగాలి. ఆ వేగంలో వంటిపై గల లోహకవచాలు, బల్లాలు, ఈటెలు రాసుకుంటూ, గీసుకుంటూ మరమరధ్వనులు చేస్తాయి. అటువంటి ధ్వనులతో పరస్పర శత్రువుల విజృంభణ సంగతి శ్లోక ప్రారంభంలోనే 'హయరణమర్మరశాత్రవ' - అనే పద సముచ్చయం సూచిస్తుంది.

క్రిందటి శ్లోకంలో మన చిత్తవృత్తుల్ని ఏనుగులతో పోలుస్తారని, చిత్తవృత్తులు అనే గజాలను నియంత్రించే అమ్మవారు 'సంపత్కరీ దేవి' అనీ, – శ్రీ లలితా సహస్రనామాల్లోని 'సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా' అనే నామ విషయాన్ని – చెప్పుకున్నాము. ప్రస్తుతం ఆ నామం తర్వాత వచ్చే 'అశ్వారూఢాధిష్ఠితాశ్వ కోటికోటిభిరావృతా' అనే నామం చెప్పే విషయాన్ని ఇక్కడ సమన్వయ పరచుకోవాలి. మనలోని ఇంద్రియాలను, ఇంద్రియ ప్రవృత్తులను గుఱ్ఱాలతో పోలుస్తారు. ఈ ఇంద్రియ ప్రవృత్తులు అనే గుఱ్ఱాలను నియంత్రించగల శక్తి 'అశ్వారూఢా' అనే దేవికి ఉంటుంది. ప్రస్తుత శ్లోకంలో తెలిపే యుద్ధం అశ్వసంబంధమైనదని శ్లోక ప్రథమ పదంలోనే చెప్పబడింది. బయట శత్రువులను జయించినవాడికి 'జయం' వస్తుంది. చిత్తవృత్తులను, ఇంద్రియప్రవృత్తులను నియంత్రించ గలిగిన వారికి 'జయం'తో పాటు 'విజయం' కూడా వస్తుందనే యోగశాస్త్ర విషయం కూడా ఇక్కడ చెప్పుకోవడం సమంజసం.

**దోర్ధుర దుర్జయ నిర్జర శక్తిభృతే :** 'భౌతిక బలాన్ని సూచించే బాహుబలం చేత జయింపవీలుగాని' అనే అర్థాన్ని 'దోర్ధుర దుర్జయ' పదాలు సూచిస్తాయి. భౌతిక బలం కాకుండా యోగబలం ఉన్నవారికే అంటే – అంతరింద్రియ చిత్తప్రవృత్తులపై స్వామిత్వం ఉన్నవారికే 'విజయం' సిద్ధిస్తుంది. జరామరణ వ్యాధులు లేనివారైన దేవతలకే ఇది సాధ్యం అని 'నిర్జర పదం' సూచిస్తుంది. ఇటువంటి దేవతలందరు అమ్మవారి

ఆజ్ఞలకు లోబడి అమ్మవారి వెంట ఉన్నారు కాబట్టి అమ్మవారికి 'జయం', 'విజయం' కూడా లభిస్తాయని 'జయ జయహే' అని సంబోధించారు.

**చతురవిచారధురీణ మహాశివ దూతకృత ప్రమథాధిపతే :** అమ్మవారి శత్రువులైన అసురులు 'బొజ్జ' (పెద్ద బాన కడుపు) లున్నవారే గాని 'బుఱ్ఱలు' ఉన్నవారు కాదు. కాని, అమ్మవారి వెంట యుక్తాయుక్త వివేక జ్ఞానం కలిగి – ఆలోచనలలోను, నిర్ణయాలు తీసుకోవడంలోనూ నైపుణ్యం గల ప్రమథగణాధిపతులు ఉన్నారు. పైగా ఆ ప్రమథ గణాధిపతులను సాక్షాత్తు పరమేశ్వరుడే అమ్మవారి వెంట వెళ్ళవలసినదిగా ఆజ్ఞాపించాడు. 'ప్ర' అంటే ప్రకృష్టముగా (చక్కగా), – 'మథ' – అంటే 'మథనం' అంటే – తీవ్రంగా మేధాశక్తి చిలికి నిర్ణయం తీసుకొనగల ధీశక్తి గలవారే ఆ అధిపతులైనవారు అని – "చతుర విచార ... ప్రమథాధిపతే' – సంబోధన సూచిస్తుంది. అంటే – అసురుల మాదిరిగా – మూర్ఖంగా, బండగా, మొండిగా ముందుకు వెళ్ళడం కాకుండా, 'నిపుణతతో పరిస్థితులను అవగాహన చేసుకొని చిత్రవిచిత్ర వ్యూహాలతో, నిర్ణయాలతో ముందుకు వెళతారు' అని కూడా ఈ సంబోధనలోని పదవిశేషణాలు సూచిస్తాయి.

**దురితదురీహ దురాశయ దుర్మద దానవ దూత దురన్తగతే :** అవతల శత్రువుల్లో – పాప కృత్యాలు చేసినవారు; దుష్టబుద్ధులు; దురాశ, దురాశయాలు కలవారు; దుర్మదాంధకారులు వున్నారు. అంటే – వారికున్నవన్నీ ఉండకూడని దుర్లక్షణాలనే సూచిస్తాయి.

ఇవతల అమ్మవారి వద్ద అన్నీ సల్లక్షణాలు కలవారే ఉన్నారు. అంటే, నైతికబలం అమ్మవారి వైపే ఉంది. ఈ నైతికబలమే ఫలితాన్ని నిర్ణయిస్తుంది. (Motives and Morals decide the result) మహా సంక్షోభాన్ని సృష్టించే మహా సంగ్రామం వస్తే ఈ ఆశయాలు, లక్ష్యాలే ఫలితాన్ని నిర్ణయిస్తాయి.

ఈ విషయాన్ని తెలియజేయడానికి - అవతల శత్రువుల దుర్లక్షణాలన్నీ ఏకరువు పెడుతూ వారిని - 'దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత'లని చెప్పారు. ఇటువంటి వారినందరినీ - 'దురంతగతే !' - అంటే - మట్టుపెట్టినదానా ! అని అమ్మవారిని సంబోధించారు.

**శ్లో॥ అయి శరణాగత వైరి వధూ వరకీర వరాభయ దాయికరే !**
**త్రిభువన మస్తక శూల విరోధి నిరోధకృతామల తూలకరే !**
**దుర్నమితామర దుందుభి నాద ముహుర్ముఖరీకృత దీనకరే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 7**

## అర్థము

అయి = ఓ (తల్లీ), శరణాగత = శరణుకోరి వచ్చిన, వైరివధూ = శత్రువుల భార్యల యొక్క, వరకీర = శ్రేష్ఠమైన పెంపుడు చిలుకలకు, వరాభయ = వరములను, దాయికరే ! = అభయమును ఇచ్చు హస్తము కలదానా !, త్రిభువన = ముల్లోకములను, మస్తక = తలలుగా కలిగిన,

శూల = త్రిశూలముచేత, విరోధి = శత్రువులను, నిరోధకృత = అడ్డుకొనుట యందు నైపుణ్యము గల, అమల = నిర్మలమైన, తూల = దోషములను పారద్రోలునటువంటి, కరే = చేతులు గలదానా !, దుర్నమిత = వంచకుల, అవర = శ్రేష్ఠము కాని అనగా అప్రియమైన, దుందుభినాద = భేరీ శబ్దముల చేత, ముహుః = మాటి మాటికి, ముఖరీకృత= ధ్వనించునవిగా చేయబడిన, దీనకరే = దీనుల చేతులు కలదానా !, హే మహిషాసుర మర్దిని = ఓ మహిషాసురుని మర్దించిన దానా !, జయ జయ = (నీకు) జయపరంపర అగు గాక !

## తాత్పర్యము

శత్రువులైన రాక్షస వీరుల వధానంతరము వారి భార్యలు (నిన్ను) శరణుకోరి రాగా, వారు పెంచుకునే చిలుకలు భయంతో అరుస్తుంటే వాటిని అమ్మవారు బుజ్జగించి అభయమిచ్చి వరాలను ఇచ్చింది. ముల్లోకాలకు రక్షణ కల్పించే త్రిశూలం చేత శత్రువులను అడ్డగించడంలో – నిర్మలమైనవి, దోషములను పారద్రోలునవి – అయిన ఆమె కరములు నైపుణ్యాన్ని ప్రదర్శించాయి. నిరంతర యుద్ధభేరీ నినాదాలకు వంచకులు హడలెత్తి భీతిల్లగా – దీనులు హర్షించి కరతాళ ధ్వనులను చేశారు. ఓ మహిషాసుర మర్దినీ ! నీకు జయపరంపర అగుగాక !

## విశేషాంశములు

**'శరణాగతవైరి వధూవరకీరవరాభయదాయికరే'** : శత్రువులైన రాక్షసులందరూ యుద్ధంలో హతులైతే వారి భార్యలు అమ్మవారిని శరణు వేడుకున్నారు. వారి పెంపుడు చిలుకలు కూడా భయంతో వణికి అరుస్తున్నాయి. "శత్రువుల్ని చీల్చి చెండాడటంలో ఎంత కఠోరమైనవో - శరణు వేడిన వారిని, దీన ప్రాణులను - బుజ్జగించి కాపాడటంలో అమ్మవారి చేతులు అంత దయాగుణం కలిగి కుసుమ కోమలంగా వుంటాయి. అంటే - 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి' - అన్నట్లుగా అమ్మవారి కరాలు వుంటాయి" - అని ప్రథమ పాద సంబోధనలో అమ్మవారి సహజమైన కరుణాపూరిత చర్యల గురించి శంకరులు ప్రస్తుతించారు. 'కేవలం వట్టి మాటలతో బుజ్జగించి కాపాడటమే కాకుండా - వారు కోరిన వరాలను కూడా ప్రసాదిస్తాయి' అని కూడా వరదాభయముద్రలు దాల్చిన అమ్మవారి హస్తాల గూర్చి శంకరులు ప్రస్తావించారు.

**త్రిభువన మస్తక శూల విరోధి నిరోధకృతామల తూలకరే** : ఈ పాదంలో కూడా అమ్మవారి కరాల గుఱించే చెపుతున్నారు. మూడు లోకాలకు దుష్టరాక్షసులవల్ల కలిగే శిరశ్శూల నుండి రక్షించడానికా అన్నట్లు - ఆ మూడు లోకాలలోని దుశ్చర్యలు చేసే దుష్టుల్ని హతమార్చడం కోసం - మూడు శిరస్సులుగా భాసించే త్రిశూలాన్ని అమ్మవారు ఒక

చేతిలో ధరించిందట ! ఈ త్రిశూలంతో ముల్లోకాలలోని దుష్ట రాక్షసులను అడ్డగించి వారిని మట్టుపెట్టడంలో అమ్మవారి చేతులు మంచి నైపుణ్యం కలవిట ! అంతేకాదు, ఆ నిర్మలమైన చేతులు – దోషాలుంటే ఆ దోషాలను పారద్రోలి నివారించడంలో గూడా నైపుణ్యము గలవిట! అంటే – భౌతికమైన దుష్టులను, మానసికమైన దోషాలను పరి హరించడంలో అమ్మవారు మంచి దక్షత గలదన్న విషయం ఈ సంబోధన సూచిస్తుంది. 'దుష్ట దూరా' 'దురాచారశమనీ' మొదలైన శ్రీలలితా నామాలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

**దుర్నమితావర దుందుభి నాద ముహుర్ముఖరీకృత దీనకరే !:** యుద్ధరంగంలో మాటి మాటికీ అమ్మవారి సేనలు జయసూచకంగా మ్రోగించే యుద్ధ భేరీ నినాదాలు వంచకులైన దుష్టరాక్షసులను హడలెత్తిస్తే – ఆ రాక్షసుల బారి నుండి విముక్తులైన దీనులు తమ హర్షాన్ని కరతాళధ్వనుల ద్వారా ప్రకటిస్తున్నారు. ఈ కరతాళ ధ్వనులు భేరీనినాదాలకు ప్రతిధ్వనులా అన్నట్లున్నాయిట ! ఇటు రాక్షసులు హడలి పోవడానికి – అటు దీనులు హర్షించడానికి కారణభూతమైన అమ్మవారి పర్శాక్రమ బాహు బల సంపన్నతను ఈ సంబోధనలో ప్రతిపాదించారు.

మొత్తం మీద ఈ శ్లోకంలో 'అమ్మవారి చేతులు' గురించి, ఆ చేతుల్లో ధరించిన వాటిని గురించే ఎక్కువ ప్రస్తావించడం జరిగింది. అమ్మవారి చేతుల్లో శంఖము, చక్రము, ఖడ్గము, పాశము, త్రిశూలము,

ధనుస్సు, బాణము, గద మొదలైన ఆయుధాలు వుంటాయి. వరాభయాలను గూడా శిష్టులకు ప్రసాదిస్తుంది. ఇన్ని రకాల ఆయుధాలను సమకూర్చుకుని అమ్మవారు యుద్ధరంగంలో శత్రువులను చీల్చి చెండాడింది. వీటిలో కొన్ని విష్ణు సంబంధమైనవి, శివసంబంధమైనవి కూడా వున్నాయి. ఎందుకంటే – అమ్మవారిది త్రిమూర్త్యాత్మక స్వరూపం. అందలి అంశల సమాహార సమన్వయ స్వరూపమే అమ్మవారు.

శ్రీ లలితా సహస్రనామాల్లో కూడా 'సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా' 'అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతా' నామాల తర్వాత 'చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతా' – ("సర్వవిధములైన ఆయుధములను సమకూర్చుకొని, చక్రరాజ రథాన్ని ఎక్కి యుద్ధరంగంలో ప్రవేశించిన దానా" అని అర్థం) అనే నామం వస్తుందని ఇక్కడ గుర్తుకు రావాలి.

**శ్లో॥ సుర లలనాతత థేయిత థేయిత తాల నిమిత్తజ లాస్యరతే!**
**కకుభాంపతి వర థోంగత తారక తాల కుతూహల నాదరతే!**
**ధిం-ధిం-ధిమికిట-ధిం-ధిమిత ధ్వని ధీర మృదంగ నినాదరతే!**
**జయ జయ హే మహిషాసుర మర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 8**

## అర్థము

సుర లలనా = దేవతాస్త్రీల చేత, తత = విస్తరింపబడిన, థేయిత – థేయిత = థేయిత థేయిత అను, తాల = తాళప్రమాణమునకు,

నిమిత్తజ = అనుకూలమైన, లాస్య = లాస్యము అనెడు నృత్తమునందు, రతే = ప్రీతిగలదానా !, కకుభాంపతివర = దిక్పాలకుల యొక్క, థోంగత = "థోం" అను నాదము నందు ఉన్న, తారకతాల = తారకము అను తాళము యొక్క, కుతూహల నాదరతే = కుతూహలమును కలిగించు నాదము నందు ప్రీతి గలదానా !, ధిం-ధిం-ధిం-ధిమికిట-ధిం-ధిమిత ధ్వని = ధిం ధిం అనుధ్వనులచేత, ధీర = గంభీరమైన, మృదంగ నినాద = మృదంగ శబ్దములందు, రతే = ప్రీతిగలదానా ! హేమహిషాసురమర్దిని = ఓ మహిషాసురుని మర్దించిన దానా !, జయ జయ = (నీకు) జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

దేవతాస్త్రీలు వేయు తాళమును అనుసరించిచేయు లాస్యము నందు ప్రీతి గలదానా ! దిక్పాలకులు వేయు "థోం-థోం" అను తాళము నందు కుతూహలమును పొందుదానా ! "ధిం-ధిం" అను గంభీర మృదంగ నాదములందు మక్కువ చూపుదానా! ఓ మహిషాసురమర్దినీ ! నీకు జయ పరంపర అగుగాక !

## విశేషాంశములు

అమ్మవారు 'చైతన్యస్వరూపిణి', 'నాదరూపిణి', 'నటేశ్వరి', 'లాస్యప్రియ', 'మహాతాండవ సాక్షిణి'. అందువలన రాగతాళలయాత్మకంగా

ఉండేవాటికి సంబంధించిన ఏ విధమైన శబ్దం విన్నా అమ్మవారు చాలా ఇష్టపడి పరవశిస్తుంది. 'థేయిత', 'థేయిత', 'ధిం', 'ధిం', 'ధిమికిట' మొదలైనవన్నీ తాళ సంబంధమైన వివిధ శబ్ద ప్రయోగాలను తెలుపుతాయి.

**శ్లో॥ ఝణ-ఝణ-ఝణ-హింకృత సురనూపుర శింజిత మోహిత భూతపతే!**
**నటిత నటార్థ నటీనట నాయక నాటిత నాటక నాట్యరతే**
**పదనత పాలిని ! ఫాలవిలోచని ! పద్మవిలాసిని ! విశ్వధురే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 9**

## అర్థము

ఝణ - ఝణ - ఝణ = ఝణ-ఝణ-ఝణ నాదములను, హింకృత = హింకారమును కలిగినట్టి, సురనూపుర = దేవతల అందెల యొక్క, శింజిత = మ్రోతలచేత, మోహిత = మోహమును పొందిన, భూతపతే = భూతాధిపతులను కలిగినదానా !, నటిత = నటించబడిన, నటార్థ = నాట్యముగల, నటీనట నాయక = నటీనట శ్రేష్ఠుల చేత, నాటిత = నటింపజేయబడిన, నాటక = నాటకములందు, నాట్య = నాట్యమునందును, రతే = ప్రీతి గలదానా !, పదనత = (నీ) పాదములకు మ్రొక్కు వారిని, పాలిని = పాలించుదానా !, ఫాలవిలోచని = నుదుట కన్నుగలదానా !, పద్మవిలాసిని = తామర పుష్పముల విలాసము, వికాసము గలదానా !, విశ్వధురే = విశ్వభారమును మోయుదానా !,

హే మహిషాసురమర్ధిని = మహిషాసురుని మర్ధించిన దానా !, జయజయ = (నీకు) జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

ఓ మహిషాసుర మర్దినీ ! (నీ) నాట్యమహోత్సవ సంరంభములో దేవతల కాలి అందెల ఝణ ఝణ నాదాలకు భూతాధినాథులందరినీ మోహితులను చేసినదానా ! నటీనటుల నాట్య హేలయందు ప్రీతి గలదానా ! నిన్ను శరణాగతి చొచ్చినవారిని కాపాడుదానా ! ఫాలలోచనీ! పద్మవిలాసినీ ! విశ్వధాత్రీ! నీకు జయపరంపర అగుగాక!

## విశేషాంశములు

అమ్మవారు సహజంగా లాస్యప్రియ, నాదరూపిణి. మనలో కనబడకుండా, వినబడకుండా ఉండే చోటు నుండి - వినబడేట్టుగా బయటకు శబ్దరూపంలో వ్యక్తం చెయ్యడానికి వాహికగా ఉపయోగపడే దాన్ని 'నాదము' అంటారు. ఈ నాదం యొక్క నేపథ్యం మీదే అన్ని రకాల ధ్వనులు,అక్షరాలు, మాటలు, వాక్యాలు తదనుగుణమైన నృత్యనాట్య భంగిమలు, సాత్త్విక భావాలు మొదలైనవన్నీ వ్యక్తమౌతాయి.

ఫ్యాను తిరగడానికి, రేడియో పలకడానికి, బల్బు వెలగడానికి - విద్యుత్ ఏ విధంగా నేపథ్యంలో ఉండి వీటి కారణరూపంగా వుంటుందో - అలాగే వివిధ ధ్వనులకు నృత్య నాట్య భంగిమలకు నాదమే

మూలకారణం ఔతుంది. అంటే నాదం మీదనే అన్ని రకాల ధ్వనులు, నృత్య నాట్య భంగిమలు, భావాలు అధ్యారోపణం చెయ్యబడతాయన్న మాట! అంటే – ప్రస్తుత శ్లోకంలో చెప్పబడిన నాదానికి సంబంధించిన రఝణ రఝణత్కారాలకు, నాట్యహేలలకు నేపథ్యంలో ఉండి భూతాధిపతులతో సహా అందరినీ ఆనందపరచేది అమ్మవారే – అన్న విషయాన్ని ఈ శ్లోకంలో సూచించడం జరిగిందన్నమాట !

**పదనతపాలిని :** అమ్మవారు అభయహస్తం వేరే ప్రత్యేకంగా పట్టకపోయినా ఆవిడ రెండు చరణాలే భక్తులు కోరిన వాటిని మించి ప్రసాదించే గుణం కలిగి భక్తులను అన్నివిధాలా కాపాడతాయి అని సౌందర్యలహరిలో 'శరణ్యే లోకానాం తవహి చరణా వేవ నిపుణౌ' అని "త్వదన్యః పాణిభ్యాం....." అన్న 4వ శ్లోకంలో చెప్పబడుతుంది. ప్రస్తుత శ్లోకంలోని 'పదనతపాలిని' అన్న సంబోధన ఈ విషయాన్ని ధ్రువ పరుస్తుంది.

**ఫాలవిలోచని :** శివునికి లాగానే అమ్మవారికి గూడా మూడు కళ్ళుంటాయి. మామూలుగా ఉండే వామ, దక్షిణ నేత్రాలు కాకుండా ఫాలభాగంలో మరో నేత్రం వుంటుంది. ఇది అగ్నితత్వాత్మకం. ఆజ్ఞాచక్రపాతంలో ఉండే ఈ కన్నును 'జ్ఞాననేత్రం' అనవచ్చును. శివుని యొక్క రూపలక్షణాలన్నిటినీ అమ్మవారు దొంగిలించిందా అన్నట్లు అమ్మవారి రూపం వుంటుందని సౌందర్యలహరిలో "త్వయా

హృత్వావామం....” అన్న 23వ శ్లోకంలో ఆదిశంకరులు చెప్తారు. ఈ శ్లోకంలోనే అమ్మవారి మూడవ కన్ను గురించి గూడా చెప్పబడుతుంది. ‘శరణ్యేత్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తుతే” అన్న శరణాగత ప్రార్థనలో ‘త్ర్యంబకే’ అన్న సంబోధన గూడా ఈ శ్లోకంలోని ‘ఫాలవిలోచని’ అన్న సంబోధనలో నిక్షిప్తమై ఉందని గ్రహించాలి.

**పద్మవిలాసిని :** “పద్మవిలాసిని” అంటే పద్మముల విలాసము, వికాసము కలది అనే అర్థమే కాకుండా ‘పద్మముల వికాసానికి కారణమైనదానా’ అని గూడా అర్థం చెప్పుకోవచ్చు. పద్మాలంటే తామర పువ్వులని ఒక అర్థం అయినా - యోగపరంగా అవి వెన్నెముక లోని సుషుమ్నా నాడి వెంబడి ఉండే షట్చక్రాలే ! యోగ సాధనలో ముందుగా ఇవి శక్తిని నియంత్రించే చక్రాలే ! సాధనలో కుండలినీ శక్తి సహస్రారం దాకా వెళ్ళి అక్కడ ఘనీభవించిన వెన్నెల రూపంలో వున్న చంద్రమండలం లోని అమృతాన్ని స్పృశించగానే - కుండలినీ శక్తి యొక్క సహజమైన అగ్నితత్వానికి అక్కడ ఘనరూపంలోవున్న అమృతం ద్రవించి అక్కడ నుండి సుషుమ్న నాడి అధోమార్గం ద్వారా స్రవిస్తూ షట్చక్రాలను తడుపుతుంది. అప్పుడు షట్చక్రాలు షట్పద్మాలౌతాయి. ఈ విధంగా షట్చక్రాలు షట్పద్మాలుగా విలసనం చెందడానికి, వికసించడానికి కుండలినీశక్తి అనే అమ్మవారే కారణం కాబట్టి అమ్మవారిని “పద్మవిలాసిని” అని సంబోధిస్తారు. ‘అమ్మవారి విలాసం (చిరునామా) ఈ పద్మాల వద్ద’ అని గూడా ఈ సంబోధనకు ఇంకొక అర్థంగా చెప్పుకోవచ్చును.

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలోని 'విశ్వధారిణీ', 'జగద్ధాత్రీ' 'విశ్వమాతా' మొదలైన అమ్మవారి నామాల అర్థాన్ని ప్రస్తుత శ్లోకంలోని 'విశ్వధురే' అన్న సంబోధన గూడా ధ్రువపరుస్తుంది.

**శ్లో॥ దనుజ సుసంగర రక్షణ సంగర పరిస్ఫురదంగ నటత్కటకే !**
**కనక నిషంగ పృషత్క నిషంగ రసద్భట భృంగ హటావటకే !**
**హత చతురంగబల క్షితిరంగ ఘటద్బహురంగ వలత్కటకే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 10**

## అర్థము

దనుజ = రాక్షసులతో జరుగు, సుసంగర = గొప్ప యుద్ధము నందు, రక్షణ సంగర = తనవారిని రక్షించు ప్రయత్నము చేత, పరిస్ఫురత్ = బాగుగా కదలునట్టి, అంగ = శరీరము వలన, నటత్ = చలించు, కటకే = కడియములు కలిగిన దానా!, కనక = బంగారు, నిషంగ = అమ్ములపొది నుండి వచ్చు, పృషత్క = బాణముల యొక్క, నిషంగ = తాకిడి చేత, రసత్ = ఒరిగిపోవునట్టి, భటభృంగ = భటులనెడు తుమ్మెదలే, హటావటకే = భక్ష్యవిశేషణముగా కలిగినదానా !, హత = చంపబడిన, చతురంగ బల = శత్రువుల యొక్క రథగజ తురగ పదాతి బలములను కలిగిన, క్షితిరంగ = యుద్ధభూమి యందు, ఘటత్ = కూడుకొనుచున్న, బహురంగ = బహుసేనాసమూహముల యొక్క, వలత్ = కదలుచున్న, కటకే = కడియములు కలిగిన దానా !, హే మహిషాసుర మర్దిని =

మహిషాసురుని మర్దించినదానా!, జయ జయ = (నీకు) జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

రాక్షసులతో జరుగు గొప్ప యుద్ధము సందు నీ వారిని రక్షించు ప్రయత్నములో నీ శరీరమంతయు కదలి కాలికడియములు కదలుచూ ధ్వనించుచుండగా, నీ బంగారపు అమ్ములపొది నుండి తీసివిడిచెడు బాణములకు - ఒరిగిపోవు భటులనెడు తుమ్మెదలే భక్ష్యము లగుచుండగా, శత్రువుల చతురంగబలము లన్నియు హతములై నీ సేనా సమూహములు నీ చేతికంకణ ధ్వనులననుసరించి చేరవలసిన చోటకు చేరుచుండగా, విజయ దర్పముతో సాగు ఓ మహిషాసుర మర్దినీ! నీకు జయపరంపర అగు గాక !

## విశేషాంశములు

అమ్మవారికి, రాక్షసులకు మహాసంగ్రామం జరుగుతోంది. ఒకవైపు- దేవతా గణాలలో ఏ ఒక్కరికీ ఏ ప్రమాదం జరక్కుండా - అత్యంత అప్రమత్తతతో అన్ని దిశలలోను అత్యంత వేగంగా చలిస్తూ - వారిని అమ్మవారు ఆదుకుంటోంది. అలా చలిస్తున్న అమ్మవారి చరణ కంకణాల నుండి రకరకాల ధ్వనులుద్భవిస్తూ చెవులు గింగుర్లెత్తుతున్నాయి. ఇంకోవైపు బంగారు అమ్ముల పొది నుండి వెంటవెంటనే వ్యవధానం

లేకుండా బాణాలు ప్రయోగిస్తోంది. నేలకొరిగిపోయే అసురుల సైనికులు అనే తుమ్మెదలు రివ్వున వచ్చే అమ్మవారి బాణాలకు భక్ష్యాలవుతున్నాయి. యుద్ధానంతరం విజయదర్పంతో ఉత్సాహంతో వెళ్తున్న అమ్మవారి చేతులకంకణాలు ధ్వనులను కలుగజేస్తున్నాయి. అమ్మవారి ఆజ్ఞలుగా దిశానిర్దేశ సంకేతాలుగా ఆ ధ్వనులు అనిపించడంతో ఆమె సేనా సమూహములు చేరవలసినచోటు చేరుతున్నాయి. ఈ విషయాల నన్నింటినీ కళ్ళకు కట్టినట్లుగాను, చెవులకు వినబడే విధంగాను శంకరులు ఈ శ్లోకంలో పదాలను ప్రయోగించారు. ఈ పద ధ్వనుల అనురవాలు – అమ్మవారి పద కంకణ నిక్వాణ తరంగాలుగా భాసిస్తూ, సంగ్రామ కోలాహలాన్ని దృశ్య కావ్యంలా పాఠకుల మనో ఫలకంపై ముద్రింప చేస్తాయి. అంటే – అమ్మవారి పదవిన్యాసంతో ఆదిశంకరుల పదప్రవాహం పోటీపడిందన్నమాట !

**శ్లో॥ మహిత మహాహవ మల్లమతల్లిక వేల్ల కరేరక భిక్షురతే !**
**విరచిత వల్లిక వేల్లిత గల్లక మల్లిక భిల్లిక వర్గయుతే !**
**భృతికృత ఫుల్ల సముల్ల సితారుణ పల్లవ తల్లజ చారుతనో !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 11**

## అర్థము

మహిత = మహిమతో కూడిన, మహాహవ = గొప్ప యుద్ధము లందు, మల్లమతల్లిక = మల్ల యోధులలో శ్రేష్ఠుడైనవాడు, వేల్ల =

(తిరిపెమునకై) తిరుగుచుండువాడు, కఠేరక = దరిద్రుడు, భిక్షు = ఆది భిక్షువును అయిన శివుని యందు, రతే = ప్రీతి గలదానా !, విరచిత = చక్కగా చిత్రింపబడిన, వల్లిక = పత్ర రేఖలచేత, వేల్లిత = ఆవరింపబడిన, గల్లక = చెక్కిళ్లను, మల్లిక = మల్లెపూల యొక్క, ఝిల్లిక = తెల్లని లొద్దుగ పూలయొక్క, వర్గయుతే = గుత్తులతో కూడిన దానా !, భృతికృత = అనుబంధముగా అమర్చబడిన, ఫుల్ల = వికసించిన, సం + ఉత్ + లసిత = చక్కగా ప్రకాశించెడు, అరుణ = ఎఱ్ఱనైన, పల్లవ తల్లజ = నునుపుగాను, సుకుమారముగాను ఉండు చిగురుటాకువలె, చారు = అందమైన, తనో = శరీరము గలదానా !, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్దించిన దానా !, జయజయ = నీకు జయపరంపర మగు గాక !

## తాత్పర్యము

గొప్ప యుద్ధములందు మల్లయోధుడు, తిరిపెమునకై ఎల్లప్పుడు తిరుగు భిక్షుకుడు అయిన శివుని యందు ప్రీతి గలదానా ! చెక్కిళ్లపై చిత్రింపబడిన పత్రరేఖలు గలదానా ! సిగలో తెల్లని లొద్దు పూలు, మల్లెపూలు సొగసులీనుదానా ! వికసించిన - నునుపైన, ఎఱ్ఱనైన చిగురుటాకుల వంటి సుకుమారమైన మేను గలదానా ! ఓ మహిషాసుర మర్దినీ ! నీకు జయపరంపర అగుగాక !

# విశేషాంశములు

**మల్లమతల్లిక** : అరణ్యాల్లో ఉన్న అర్జునునికి, ఆ అర్జునుణ్ణి పరీక్షిద్దామని కిరాతరూపంలో వచ్చిన శివునికి మధ్య ఒక వరాహ విషయంలో పోట్లాటవచ్చింది. వరాహాన్ని నేను కొట్టానంటే నేను కొట్టానని వాదులాడుకున్నారు. ఆ వాదులాట చివరకు ఒక గొప్ప యుద్ధానికి దారితీసింది. అన్నిరకాల పద్ధతులలో యుద్ధం జరిగినా గెలుపు ఎవరిదనేది విషయం తేలకపోవడంతో చిట్ట చివరకు ఇద్దరూ మల్లయుద్ధానికి దిగారు. అర్జునుని యుద్ధనైపుణ్యానికి మెచ్చుకుని శివుడు అర్జునునికి పాశుపతాస్త్రాన్ని గూడా బహూకరించాడు. యోగ విషయంలో ఎంతటి ధీరుడో మల్ల యుద్ధ విషయంలో గూడా శివుడు అంతకు మించిన వాడే !

**వేల్లకతేరక** : శివుడు ఆది భిక్షువు. తిరిపెమెత్తడానికి గుమ్మం గుమ్మానికి తిరుగుతాడు. అందుకని శివుణ్ణి "వేల్ల కతేరక భిక్షువు" అని అన్నారు. అయితే "విశ్వనాథుడు అయిన శివుడు తిరిపెమెత్తడమేమిటి?" అని సందేహం రావచ్చు. ఆయన తిరిపెమెత్తేది భక్తికోసం. గుమ్మం గుమ్మానికి తిరగడం అంటే – ఏ ఇంట్లో అయినా, ఎవరైనా తనపట్ల భక్తి కలిగిన వారు ఉంటే – వారి భక్తిని అడిగి తీసుకుని వారికి 'ముక్తి' ఫలాన్ని బదులుగా ఇస్తాడు శివుడు. అందుకు ఆయన భిక్షాపాత్రలాగా పట్టుకు తిరిగేది "కపాలాన్ని". అది మన 'బుఱ్ఱకాయ'కు సంకేతం.

అంటే- మన బుట్టలో భక్తి భావాలు ఉంటే వాటిని స్వీకరించి ప్రతిఫలంగా ముక్తిని ప్రసాదిస్తాడన్నమాట! తన పిల్లలకు ముక్తినిచ్చే వాడు గాబట్టి - అటువంటి శివుడంటే అమ్మవారికి ప్రీతి ! అంతేగాని ముష్టి ఎత్తడాన్ని, ముష్టెత్తుకునే వాళ్ళను ఇష్టపడుతుందని కాదు.

**విరచిత వల్లిక వేల్లితగల్లక** : అమ్మవారి చెక్కిళ్లు బోసిగా వుండవుట. ఆ చెక్కిళ్లపై చిత్రాతి చిత్రంగా పత్రరేఖలు చిత్రింపబడి కళాత్మకంగా, శోభాయమానంగా ఉంటాయిట ! అందుకని అమ్మవారిని 'విరచితవల్లిక ... గల్లక" అని సంబోధించారు.

**మల్లిక భిల్లిక వర్గయుతే** : అమ్మవారు హిమవత్పర్వతరాజు పుత్రిక. పర్వతంపై వర్ధిల్లే లొద్దుగపూలన్నా, కొండమల్లెలన్నా అమ్మవారికి ఇష్టం. వాటిని తన వేణీబంధంలో ధరిస్తుంది. అందుకని "మల్లిక....యుతే" అనే సంబోధన.

**భృతికృత ఫుల్ల సముల్ల సితారుణ పల్లవ తల్లజ చారుతనో** : ఇంతవరకు అమ్మవారి సిగ సింగారాన్ని, చెక్కిళ్ల చక్కదనాన్ని వర్ణించిన శంకరులు అమ్మవారి శిరీష కోమలమైన తనూ లావణ్యాన్ని ఈ సంబోధన ద్వారా తెలియపరచారు.

అప్పుడే వికసించిన ఎఱ్ఱని చిగురుటాకుల సోయగము, సుకుమారత్వములతో అమ్మవారి మేని సౌందర్యం విరాజిల్లుతూ వుంటుందిట! మహిషాసురుని లాంటి అసురవీరుణ్ణి మర్దించగలిగే

బల పరాక్రమ సంపన్నురాలైనా గూడా అమ్మవారు శిరీష కోమలమైన తనూలావణ్యము గలదే అని ఈ సంబోధన తెలియజేస్తుంది. అంటే 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి' (వజ్రం కంటే కాఠిన్యం, పువ్వు కన్నా మెత్తదనం కలిగినది) అన్న విశేషణాలు అమ్మవారి సంకల్ప బలానికి, మేని సోయగానికి వర్తిస్తాయన్నమాట !

**శ్లో॥ అయి సుమనస్సు మనస్సు మనోహర కాంతిలసత్కలకాంతియుతే!**
**సుత రజనీ రజనీ రజనీ రజనీకర వక్త్ర విలాసయుతే !**
**నయన సువిభ్రమ విభ్రమద భ్రమర భ్రమరాధిప విశ్వనుతే**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 12**

## అర్థము

అయి = ఓ (తల్లీ !), సుమనస్ = దేవతల యొక్క, సుమనస్ = పుష్పముల యొక్క, సుమనోహర = చాలా అందమైన, కాంతి = కాంతివలె, లసత్ + కలకాంతి = ప్రకాశించు సూక్ష్మమైన కాంతి చేత, యుతే = కూడుకొని యున్నదానా !, సుతరజనీ = పొందిన వెలుగును ప్రసరింప జేయునట్టి, రజనీ = ఆహ్లాదపరచునట్టి, రజనీ = (పున్నమి) రాత్రియందలి, రజనీకర = చంద్రునివంటి, వక్త్ర = ముఖము యొక్క, విలాస = విలాసములతో, యుతే = కూడుకొని యున్నదానా, నయన = కన్నుల యొక్క, సువిభ్రమ విభ్రమద = ఆశ్చర్యము గొలుపు మంచి విలాస వికాసములను కలిగినవి అయిన, భ్రమర = తిరుగుచుండు, భ్రమరాధిప

= తుమ్మెదరేడుల చేత, విశ్వ = సమస్త ప్రపంచవాసుల చేత, నుతే = కీర్తింపబడుదానా !, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్దించినదానా, జయ జయ = నీకు జయమగుగాక!

## తాత్పర్యము

దేవతాపుష్పాల కాంతి వలె సుకుమారమైన, మనోహరమైన కాంతి పుంజములను విరజిమ్ముదానా ! పున్నమి చంద్రుని వెన్నెల వెలుగులను ప్రసరించు ముఖ విలాస వికాసములు కలిగినదానా ! సమస్త ప్రపంచవాసుల చేత స్తుతింపబడుదానా ! తుమ్మెదరేడుల చేత నయనానందకరముగాను, ఆశ్చర్యచకితులను చేయునట్లుగాను ఝుంకారములతో కీర్తింపబడుదానా ! మహిషాసురుని మర్దించిన దానా! నీకు జయపరంపర అగుగాక !

## విశేషాంశములు

**(గమనిక:** "అయి తవ సుమనస్సు మనస్సు .... అంటూ ఈ శ్లోకం చాలా పుస్తకాల్లో ఉంది. ఇలా ఉంటే శ్లోక గమనము అంటే - 30 మాత్రల ఛందస్సు మారిపోతుంది. అలాగే శ్లోకంలోని మూడవపాదం - "సునయన వరనయన సువిభ్రమద....." అని చాలా పుస్తకాల్లో ఉంది. ఈ సందర్భంలో గూడా ఛందస్సు మారిపోయి శ్లోక గమనం దెబ్బతింటుంది. )

**అయి సుమనస్సు మనస్సు మనోహర కాంతిలసత్కలకాంతియుతే:** అమ్మవారిని, అమ్మవారి తనూకాంతిని ఊహించాలంటే మంత్రపుష్పంలో 'నీల తోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా" అనీ, శ్రీ లలితా సహస్రనామాల్లో – "తటిల్లతాసమరుచిః" అనీ, 'బిసతంతుతనీయసీ' అనీ చెప్పబడింది. అంటే – 'నల్లని మేఘ మధ్యంలో మెరిసే మెఱపు తీగలాగాను', 'తామరతూడును విరిస్తే కనబడే సన్నని పోగు (Fibre) లాగాను' ఉంటుంది – అని అర్థం. అంత సూక్ష్మంగాను, సుకుమారంగాను, కాంతిమంతంగాను ఉంటుందన్నమాట ! సరిగ్గా ఇదే విషయాన్ని ఈ శ్లోక ప్రథమపాదంలో "అయి సుమనస్సు..... కాంతియుతే!" అని శంకరులు కీర్తించారు.

**సుత రజనీ రజనీ రజనీ రజనీకర వక్త్ర విలాసయుతే ! :** శ్రీ లలితా సహస్రనామాల్లో "శరచ్చంద్రనిభాననా" అన్న నామంలో చెప్పబడిన విషయమే ఈ స్తోత్రంలో శంకరుల చేత "సుతరజనీ ... విలాసయుతే' అని కీర్తింపబడింది. ఇదే విషయము సౌందర్యలహరిలో 'పరిణతశరచ్చంద్రవదనా' అని చెప్పబడింది. అంటే – 'శరత్కాల పూర్ణిమా చంద్రుని వంటి వదనము గలది' అని అర్థం.

**నయన సువిభ్రమ విభ్రమద భ్రమర భ్రమరాధిప :** చురుకుగాను, చైతన్యవంతంగాను ఉండే తుమ్మెద రేడులు – నల్లగాను, నునుపుగాను ఉండి కాటుక పెట్టిన స్త్రీల నయనాల లాగాను, ఆ నయన వీక్షణాల లాగాను ఉంటాయి. అమ్మవారిని సేవిస్తున్నప్పుడు, స్తుతిస్తున్నప్పుడు

భక్తి – స్త్రీల కన్నులలో స్ఫుటంగా కనిపిస్తుంది. అలాగే 'భ్రమరాలు చేసే ఝుంకారాల్లో గూడా అటువంటి భక్తిరాగాలు వినిపించి చూసే వారికి సంభ్రమాశ్చర్యాలను కలుగ జేస్తాయి' అని శంకరులు ఈ శ్లోక తృతీయ పాదంలోని పైన తెల్పిన సంబోధనలో చెప్పారు.

**యోగపరమైన అర్థం :** 'భ్రమరం' అంటే 'తుమ్మెద' అని అర్థం. తుమ్మెదకు ఆరుకాళ్లుంటాయి. అందుకే తుమ్మెదను 'షట్పదం' అంటారు. ఈ కాళ్లతో పద్మాది పుష్పాల మీద వ్రాలి వాటికి శోభను చేకూర్చడమే గాక, ఫలదీకరణకు తోడ్పడి తద్వారా వాటి వంశాభివృద్ధికి దోహదకారులౌతాయి. అలాగే – కుండలినీశక్తి అనే అమ్మవారు ఉపాసకుని సాధనలో సుషుమ్నా నాడి యొక్క ఊర్ధ్వ మార్గం ద్వారా మూలాధారాది షట్చక్రాలను స్పృశిస్తూ, నియంత్రిస్తూ – సహస్రారంలోని శివుణ్ణి చేరి, ఉపాసకునికి ముక్తి ఫలాన్ని చేకూరుస్తుంది. అంటే –

భ్రమరాల భ్రమర గమన ఝుంకారాల్లో – 'రాగసాధన' ఉంటే – వెన్నెముక వెంబడి అమ్మవారి ఊర్ధ్వ గమన ప్రక్రియలో – 'యోగ సాధన' ఇమిడి ఉంటుందన్నమాట !

**విశ్వనుతే ! :** అమ్మవారు – బాహ్యరంగంలో 'భోగవిశ్వ' చేత నుతింపబడితే – అంతరంగంలో 'యోగవిశ్వం'చేత నుతింపబడుతుందని సూచించడానికి 'విశ్వనుతే' అని రెంటికీ సరిపోయే విధంగా శంకరులు అమ్మవారిని సంబోధించారు.

**శ్లో॥ అవిరళ గండక మేదుర సమ్మద మత్త మతంగజ రాజగతే !**
**త్రిభువన భూషణ భూత కళానిధి రూప పయోనిధి రాజసుతే !**
**అయి సుదతీజన లాలస మానస మోహన మన్మథ రాజగతే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 13**

## అర్థము

అవిరళ = దట్టమైన, గండక = చెక్కిళ్లయందు, మేదుర = నిగ్గు దేలిన, సమ్మద = మదజలముగల, మత్త = మదించిన, మతంగజ = మదపుటేనుగుల యొక్క (నడకవలె), రాజగతే = గంభీరమైన నడకగలదానా !, త్రిభువన = ముల్లోకములకు, భూషణ భూత = అలంకారము వంటి, కళానిధి = చంద్రుని యొక్క, రూప = రూపము వలె, అందమైన రూపము గల, పయోనిధి రాజసుతే = సముద్ర పుత్రికా!, అయి = ఓ, సుదతీజన = స్త్రీలయందు, లాలస = ఆసక్తి గల, మానస = మనస్సు గల వారిని, మోహన = మోహింప జేయు, మన్మథరాజ = మన్మథునకు, గతే = ఆశ్రయమైనదానా, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్ధించిన దానా !; జయజయ = నీకు జయమగుగాక!

## తాత్పర్యము

దట్టమైన చెక్కిళ్ళ నుండి మదజల ధారలు కారుతూ వుండే మదపు టేనుగుల నడకలవంటి ధీర గంభీరమైన నడకలు గలదానా ! మూడు లోకాలకు అలంకారంగాను, ఆహ్లాదకరంగాను ఉండే చంద్ర బింబ ప్రసన్న

రూపం గలదానా ! సౌందర్యా సక్తులను మోహింప జేయు మన్మథుని కామ కళావిలాసాలకు ఆశ్రయ లక్ష్యమైన దానా! మహిషాసురుని మర్దించిన దానా ! నీకు జయపరంపర అగుగాక !

## విశేషాంశములు

**అవిరళ గండక మేదుర సమ్మద మత్త మతంగజ రాజగతే !:** అమ్మవారి నడకలో హడావుడి, తత్తరపాటు ఉండవు. అయినా ఆ నడకలో ఒక విధమైన ధీరత్వం, గంభీరత్వం ఉంటుంది. ఈ నడక ఎలా వుంటుందో మనకు తెలియ చెప్పడానికి 'చెక్కిళ్ల నుండి మదజలధారలు కారుతూ గంభీరంగా నడుస్తూ వుండే మదపుటేనుగుల గమనం లాగా ఉంటుందని' ఈ శ్లోకంలో చెప్పారు. శ్రీ లలితాసహస్రనామాల్లో 'మరాళీ మందగమనా' అని చెప్పబడింది. హంసల నడక గూడా ఠీవిగా నిదానంగా హుందాగా వుంటుంది. అందులోను ఆడు హంసల నడక మరింత శోభాయమానంగా వుంటుంది. 'మందగమనమే మగువలకు మర్యాదాలంకారం' అని ఈ రెండు రకాల ఉపమానాలు తెలియజేస్తాయి.

**త్రిభువన భూషణ భూత కళానిధి రూప పయోనిధి రాజసుతే !:** ఎన్ని శీతలీకరణ యంత్రపరికరాలు ఏర్పాటు చేసుకున్నా చంద్రుడిచ్చే చల్లదనాన్ని, ఆహ్లాదాన్ని అవి ఇవ్వలేవు. పైగా ఈ విశ్వమంతటికీ ఒకే ఒక్క చంద్రబింబంచాలు. ప్రసన్నతకు, ఆహ్లాదానికి, సుఖానుభూతికి చంద్రుడొక్కడు చాలు ! అలాగే అమ్మవారి సాన్నిధ్యం గూడా

ముల్లోకవాసులకు అంతటి ఆనందాన్ని, ఆహ్లాదాన్ని, ఆనందానుభూతిని కలుగజేస్తుంది అని చెప్పడం కోసమే ఈ సంబోధన. (యోగపరంగా చెప్పుకోవాలంటే- చంద్రుడు మనస్సును సూచిస్తాడు. (చంద్రమా మనసో జాతః) కాబట్టి ఆ మనస్సు సంపూర్ణంగా సంతృప్తిగా ఉంటే అదే ఆనందానికి కారణభూతమౌతుంది అని అర్థం చెప్పుకోవచ్చు.

**సుదతీజన లాలస మానస మోహన మన్మథ రాజగతే !** : అమ్మవారి అందాన్ని ఆశ్రయించుకుని అనగా అనుసరించి మన్మథుడు స్త్రీల అందాన్ని చక్కదిద్ది ఇతరులను మోహపరవశులను చేస్తాడేమో నన్నట్లుగా అమ్మవారి అందం ఉంటుందని ఈ సంబోధనకు అర్థం. "వదనస్మర మాంగళ్య గృహతోరణచిల్లికా" అని అమ్మవారి కనుబొమ్మల గురించి శ్రీ లలితా సహస్ర నామాల్లో చెప్పబడుతుంది.

మన్మథుడు తన కార్యక్రమ నిర్వహణకు ఒక నిలయాన్ని ఏర్పరచుకోవాలనుకున్నాడు. ఇందుకు అమ్మవారి ముఖాన్ని మించినది ఏదీ మన్మథునికి నచ్చలేదుట ! ఎందుకంటే, అన్ని రకాలుగాను అందచందాలతో ఉన్న ముఖం అమ్మవారిది. 'ఈ అమ్మవారి ముఖాన్నే తన నివాసంగా చేసుకుంటే ఇంకొక అదనపు సౌకర్యం కూడా ఉన్నదిట. ఈ గృహానికి నిత్య కళ్యాణ శోభను కలుగజేసే పచ్చతోరణాలను వేరే కట్టాల్సిన పనిలేదుట. అమ్మవారి ముఖంలో ఎంతో రమణీయంగా కనబడే ఆమె కనుబొమ్మలే ఈ తోరణాలుగా భాసిస్తాయి గదా !' అంటాడు మన్మథుడు. అంటే ఆ మన్మథుని ఇల్లులాగా అమ్మవారి ముఖం వుంటే

– ఆ ఇంటికి పచ్చతోరణాలుగా అమ్మవారి కనుబొమలు భాసిస్తున్నాయన్నమాట ! అని వ్యాసులవారు అమ్మవారి కనుబొమలను వర్ణించారు.

'శివుడంతటి వాణ్ణి ఎదుర్కొనడానికి వెళ్ళినపుడు గూడా అమ్మవారి ముఖంలాగా కనబడే విధంగా మన్మథుడు తన రథాన్ని రూపొందించి, శివునికి మోహాన్ని కలుగచేసి జయించాడు' అని సౌందర్యలహరిలో 'స్ఫురద్గండాభోగ......' అనే 59వ శ్లోకంలో శంకరులు స్తుతిస్తారు. శ్రీలలితా సహస్రనామాల్లోని "కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా" అనే నామాన్ని గూడా ఇక్కడ గుర్తు చేసుకుంటే – సందర్భోచితంగా ఉంటుంది.

**శ్లో॥ కమల దళామల కోమల కాంతి కలా కలితాకుల బాలలతే !**
**సకల కలావిచయక్రమకేలి చలత్కల హంస కులాలికులే !**
**అలికుల సంకుల కువలయ మండిత మౌళి లసత్సమదాలికులే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 14**

## అర్థము

కమలదళ = తామరపూరేకుల యొక్క, అమల = స్వచ్ఛమైన, కోమల = సుకుమారమైన, కాంతి = కాంతియొక్క కలాకలిత = శోభతో కూడిన, ఆకుల = కదలుచుండు, బాలలతే = లేత తీగవంటిదానా !, సకల కలా = అన్ని కళల యొక్క, విచయ = సమూహము యొక్క క్రమ = క్రమము నందలి, కేలి = కేళులందు, చలత్ = కదలునట్టి,

కలహంస = శ్రవణానందకరమైన స్వరమును కలిగిన హంసల యొక్క, కుల = సమూహమును, అలికులే = తుమ్మెదల సమూహమును కలిగినదానా!, అలికుల = తుమ్మెదల సమూహముతో, సంకుల = ఇంపుగా నింపబడిన, కువలయ = కలువలచేత, మండిత = అలంకరింపబడిన, మౌళి = శిరస్సుపైన, లసత్ = భాసించు, సమద = మదముతో కూడిన, అలికులే = తుమ్మెదల సమూహమును కలిగినదానా!, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్దించిన దానా !, జయజయ = నీకు జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

తెల్ల తామర పూరేకుల యొక్క స్వచ్ఛమైన సౌకుమార్యం గల కాంతి యొక్క శోభతో కూడిన కదలుచుండెడి లేత తీగ వంటిదానా ! సకల కళాసంచయమైన (నీ) కేళులందు కలరవాలతో తుమ్మెదలు, కమనీయమైన రాయంచల నడకలతో గొప్పగా ఒప్పుచుండుదానా ! మదముతో ముదముతో చేసే తుమ్మెదల ఝుంకారాలకు ముఖం విప్పారిన కలువలను శిరస్సుపై ధరించి ఆనంద లాస్యాన్ని ప్రదర్శించే దానా! మహిషాసురుని మర్దించిన దానా ! నీకు జయపరంపర అగుగాక !

## విశేషాంశములు

ఈ శ్లోకంలో – తామరపూలను, కలహంసలను – తుమ్మెదలను,

కలువపూలను - ఉపమానాలుగా తీసుకొని అమ్మవారి కాంతులను, నడకలను, లాస్య భంగిమాలంకారాలను వర్ణించారు.

1) ప్రకాశానికి, వికాసానికి, మోదానికి, ప్రమోదానికి, తామరపూలు ఉద్దీపనాలు. అందుకే అమ్మవారి సహజ కాంతుల్ని వాటితో పోల్చారు. యోగపరంగా కూడా సుషుమ్నా మార్గంలోని షట్పద్మాల విలసనమే సాధకుని కుండలినీశక్తి వికాసానికి కారణం ఔతుంది అనే సంబంధాన్ని ఇక్కడ సమన్వయించవచ్చు.

2) అలాగే కలరవాలతో కమనీయంగా కదుల్తూ, మెదుల్తూ ఉండే హంసలు, తుమ్మెదలను - శ్వాస ఆధారంగా జరిగే యోగాభ్యాస విన్యాసాలకు ఉద్దీప ఉపమానాలుగా - సమన్వయించారని అర్థం చేసుకోవచ్చు.

3) గాలి తాకిడికి, తమపై వ్రాలిన తుమ్మెదల సుఖస్పర్శకు తలలాడిస్తున్నట్లు కనబడే కలువపూలను - లాస్య గమనంలో అమ్మవారు ఆడించే మస్తక మంద్ర ముద్ర భంగిమాలంకారాలుగా సమన్వయించడం గూడా సముచితమే గదా !

నల్లకలువలు నల్లగా ఉంటాయి గదా ! అవి దట్టంగా కలిసి వుంటే ఆ నల్లదనం మరింత నల్లగా వుంటుంది. ఆ నల్ల కలువలపైన గండు తుమ్మెదలు వుంటే ఎలా వుంటుంది ? చిక్కటి చీకటి పులుముకున్నట్లుంటుంది. అమ్మవారి తలకట్టుపైన శిరోజసంపద అంత

నునుపుగాను, చిక్కగాను వుండే నల్లరంగులో వుంటుందన్నమాట ! సౌందర్యలహరిలో గూడా "ధునోతుధ్వాంతం నస్తులిత దళితేందీవరవనం, ఘన స్నిగ్ధం శ్లక్ష్ణం చికుర నికురంబం తవశివే!" (దట్టంగా, నునుపుగా, నల్లగా కనిపించే నల్ల కలువల తోటలాగా వుండే శిరోజ సంపద, కబరీ బంధాలు) అన్న 43వ శ్లోకంలో ఆదిశంకరులు అమ్మవారి తలకట్టును వర్ణించారు.

శ్లో॥ **కల మురళీరవ వాజితకూజిత కోకిల మంజుల గానరతే !**
**మిళిత మిళింద మనోహర గుంఫిత రాజతశైల నికుంజగతే !**
**మృగ గణ భూత మహా శబరీగణ రింఖణ సంభృత కేళియుతే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే. 15**

## అర్థము

కల = శ్రవణపేయమైన, మురళీరవ = మురళీనాదమునందు, వాజిత = వేగముతో కూడిన, కూజిత = కూతగల, కోకిల = కోకిల యొక్క, మంజుల = మనోహరమైన, గాన = గానము నందు, రతే = ప్రీతి గలదానా !, మిళిత = కలసి యున్న, మిళింద = తుమ్మెదల చేత, మనోహర = అందమైనదియు, గుంఫిత = దట్టమైనదియు, (అయిన) రాజత శైల = హిమవత్పర్వతము నందలి, నికుంజ = పొదరింటిలో, గతే = ఆశ్రయము గలదానా !, మృగ = మృగముల యొక్క, గణ = ప్రమథగణముల యొక్క, భూత = భూతముల యొక్క, మహాశబరీ

గణ = గొప్ప శబర యువతుల సమూహము యొక్క, రింఖణ = అవయవాలంకారాదుల సంచలనములో, సంభృత = కూడిన, కేళి = నృత్యమునందు లేదా నృత్యమును, యుతే = కూడియున్నదానా !, అనగా చేయుదానా!, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్దించిన దానా !, జయజయ = నీకు జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

మనోహరమైన మురళీనాదమును, మధురమైన కోకిలగానమును అమితముగా ఇష్టపడుదానా ! కైలాస పర్వతముపైన దట్టముగా అల్లుకొన్న పొదరిల్లు, అందు అలముకొన్న తుమ్మెదల ఝుంకారములను ఇష్టపడి, దానిని నివాసముగా కలిగియున్న దానా ! ఆ పర్వతము నందు సంచరించు నానావిధములైన మృగములు, ప్రమథ గణములు, శబర యువతులు కలిసి చేయు బృందనృత్యాలను చూచుచు వినోదించుదానా! మహిషాసురుని మర్దించిన దానా ! నీకు జయము కలుగుగాక !

## విశేషాంశములు

మనం వేణువును సక్రమంగా ఊదితే మురళీనాదం వస్తుంది. కాబట్టి ఇది మనుష్య సంబంధాన్ని సూచిస్తుంది. కోకిల కలకూజితం పక్షుల సంబంధాన్ని సూచిస్తుంది. తుమ్మెద – కీటకాలను, 'మృగ' శబ్దం – జంతు సంబంధాన్ని, 'గణ' శబ్దం ప్రమథ గణాలను, 'భూత'

శబ్దం - పంచభూతాలను, 'మహా' శబ్దం - దేవతలను, గంధర్వులను, 'శబరీ, గణ' పదాలు - ఆటవిక నిమ్నజాతులను, వన్యప్రాణులను సూచిస్తాయి. ఈ విధమైన సంకేతాలున్నాయనుకుంటే - అమ్మవారు దేవ గంధర్వ కిన్నర కింపురుష మనుష్య మృగ పక్షి కీటక వన్యప్రాణులందరి చేతను - నాదాల ద్వారానో, గానాల ద్వారానో, లయవిన్యాస క్రీడా నృత్యాల ద్వారానో - ఆరాధింపబడుతూ, ఆనందిస్తూ వుంటుందని చెప్పుకోవచ్చును.

**యోగపరమైన అర్థం :** వేణువు, వేణువు నందలి రంధ్రాలు - వెన్నెముకను (యోగదండాన్ని), సుషుమ్నా పథం వెంబడి షట్చక్రాలను సూచిస్తాయి అనుకుంటే, మురళి - యోగోపాసనను, నాదోపాసనమును; కోకిలకూజితం - మధుర స్వరాలతో చేసే యోగసాధకుల మంత్రోచ్చారణను, గానామృతాన్ని; తుమ్మెదల ఝుంకారం యోగసాధకుల ఓంకారోపాసనను, 'రింఖణ' శబ్దం - యోగసాధకుల అంగన్యాస, కరన్యాస ముద్రాదులను సూచిస్తాయి అనుకుంటే - ఇవన్నీ అమ్మవారిని ఉపాసించి, ఆరాధించి, ఆనందింపజేసే యోగ విధానాలే అని తెలుస్తుంది.

**శ్లో॥ కటి తట నీత దుకూల విచిత్ర మయూఖ సురంజిత చంద్రకలే !**
**నిజ కనకాచల మౌళి పయోగత నిర్ఝర కుంజర చారురుచే !**
**ప్రణత సురాసుర మౌళి మణిస్ఫుర దంశు లతాధిక చంద్ర రుచే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే ! 16**

## అర్థము

కటితట = కటి ప్రదేశము వద్ద, నీత = ధరింపబడిన, దుకూల = పట్టు చీర యొక్క విచిత్రమయూఖ = చిత్ర విచిత్ర కాంతుల చేత, సురంజిత = బాగా ఎఱ్ఱగా మారిన, చంద్రకలే ! = చంద్రకళను కలిగినదానా !, నిజ = తన యొక్క కనక = బంగారు, అచల = కొండయొక్క, మౌళి = శిఖరముపైనున్న, పయః = నీటియందు అనగా ఆకాశ గంగయందు, గత = ఉన్న, నిర్జర కుంజర = ఐరావతము యొక్క చారురుచే = అందమైన కాంతి గలదానా, ప్రణత = వంగి నమస్కరించు, సురాసుర = దేవదానవులయొక్క మౌళి = శిరస్సులపై నున్న, మణి = మణుల యొక్క, స్ఫురత్ = ప్రకాశించునట్టి, అంశులతా = కాంతి కిరణరేఖల చేత, అధిక = అధికమైన, చంద్రరుచే = చంద్రకాంతి కలదానా !, హే మహిషాసుర మర్దిని ! = మహిషాసురుని మర్దించిన దానా !, జయజయ = నీకు జయమగుగాక!

## తాత్పర్యము

నీ నడుము వద్ద కట్టిన ఎఱ్ఱని పట్టుచీరయొక్క చిత్ర విచిత్ర కాంతుల ప్రసారానికి తలపై నున్న నెలవంక ఎఱ్ఱదనంతో మిడిసిపడుతోంది. మేరు పర్వత శిఖరాన ఆకాశగంగలో విహరించి జలక్రీడలాడే ఐరావతపు కాంతులకు సమానమైన మేని కాంతులు గలదానా ! నిత్యము శిరస్సు వంచి నీకు నమస్కరించే దేవదానవుల

మకుట మాణిక్యాది రత్నాల కాంతులు నీ శిరస్సు పై గల చంద్రకాంతుల్ని మరింత ఇనుమడింప చేస్తున్నాయి. ఓ మహిషాసుర మర్దినీ ! నీకు జయము గలుగు గాక!

## విశేషాంశములు

**కటి తట నీత దుకూల విచిత్ర మయూఖ సురంజిత చంద్రకలే !:** శ్రీలలితా సహస్రనామ స్తోత్రంలో 'అరుణారుణ కౌసుంభవస్త్ర భాస్వత్కటీతటీ' అని ఒక నామం ఉంది. ఉదయసూర్యుని వర్ణంలో, కుంకుమ పువ్వురంగులో ఉండే ఎఱ్ఱని పట్టు వస్త్రంతో కాంతులు చిమ్ముతూ ఉండే కటి ప్రదేశం గలది" అని ఈ నామానికి అర్థం. ఈ విధంగా వున్న కటి వస్త్రపు అరుణ కాంతులు పడి అమ్మవారి శిరస్సు పై అలరారే చంద్రవంక రాగరంజిత మౌతోందని ప్రస్తుత శ్లోకంలో వర్ణిస్తున్నారు. అంతేకాదు దీనికి తోడు – అమ్మవారికి నిత్యము తలలు వంచి నమస్కరించే దేవదానవుల కిరీటాలలోని మాణిక్యాది రత్న కాంతులు గూడా ఈ నెలవంకపై బడి ఆ చంద్రుడు వివిధ వర్ణ వికాసాలకు, విలాసాలకు నెలవై విరాజిల్లుతున్నాడట ! మాణిక్యాది రత్నాలతో పొదిగిన మకుటాలతో దేవదానవులు శిరస్సువంచిచేసే అభివందనాల వలన, అరుణారుణ కౌసుంభ వస్త్రం వలన, వీటి వలన రాగరంజిత మౌతూ శిరస్సున ఉండే నెలవంక వలన – అమ్మవారు నఖశిఖ పర్యంతం అరుణారుణ కాంతులు వెదజల్లుతూ "సర్వారుణా" అనే నామానికి అర్థం చెప్పుతున్నదా అన్నట్లుందన్నమాట!

**నిజ కనకాచల మౌళి పయోగత నిర్ఘర కుంజర చారురుచే ! :** "ఐరావతం" క్షీరసముద్రంలోంచే పుట్టింది. మన వెన్నెముకలో సుషుమ్నానాడి క్రింద నుండి పైకి ఊర్ధ్వదిశగా వుంటుంది. బ్రహ్మాండంలోని ఆకాశంలో మనం చూసే పాలపుంతకు ప్రతీకయే ఈ సుషుమ్నానాడి. వెన్నెముకలోని ఈ సుషుమ్నా నాడిని అనుసరించి శరీర నిర్మాణం ఏర్పడుతుంది. అలాగే పాలపుంతను అనుసరించి విశ్వ నిర్మాణం ఏర్పాటౌతుంది. సూక్ష్మంగావుండే సుషుమ్నా మార్గాన్ని 'మేరుదండ మార్గం' అంటారు. అలాగే పెద్ద పన్నాలో ఉండే పాలపుంత మార్గాన్ని 'సుమేరు మార్గం' అంటారు. ఈ సుమేరు శృంగ మధ్యంలోనే అమ్మవారు ఉంటుందని శ్రీ లలితా సహస్రనామాల్లో 'సుమేరు శృంగ మధ్యస్థా' అని నామం వుంది. మనలో ఈ మేరు దండానికి ఊర్ధ్వంగా వున్న శిఖరంలో చంద్రమండలం వుంటుంది. ఈ చంద్రమండలం తాలూకు వెన్నెలనే 'ఆకాశగంగ' అంటారు. ఈ చంద్రుడు గాని, ఐరావతం గాని ఈ క్షీర సముద్రంలోంచి ఉద్భవించిన వారే అని ఇక్కడ గుర్తుకు తెచ్చుకుంటే - ఐరావతపు మేనికాంతి స్వచ్ఛంగాను, నిర్మలంగాను ఉంటుంది అని తెలుస్తుంది. అందుకే కుండలినీ శక్తి అనే అమ్మవారి మేనికాంతి కూడా ఈ ఐరావతపు మేనికాంతిలాగా స్వచ్ఛంగా, నిర్మలంగా వుంటుందని ఈ శ్లోకంలోని రెండవ పాదంలో చెప్పబడింది. (నేను వ్యాఖ్యానించిన శ్రీ లలితా సహస్ర నామ వివరణ ప్రథమ భాగం చదువుకుంటే ఇక్కడ చెప్పిన విషయాలు బాగా అర్థమౌతాయి).

**శ్లో॥ విజిత సహస్రకరైక సహస్ర సుధాకర రూప వరైక నుతే !**
**కృత సుత తారక సంగర తారక తారక సంగర సంగనుతే !**
**గజముఖ షణ్ముఖ రంజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే !**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే! 17**

## అర్థము

విజిత = జయించబడిన, సహస్రకర = సూర్యుని చేత లేదా కార్తవీర్యార్జునుని చేత, ఏక సహస్ర = ఒక వేయి మంది, సుధాకర రూప = చంద్రుని వంటి అందమైన రూపము గల, వర = శ్రేష్ఠులైన వారి చేత, ఏకనుతే = ఎడతెగక స్తుతింపబడుదానా !, కృత = చేయబడిన, సుత – తారక = కుమారస్వామి తారకాసురుల, సంగర = యుద్ధమునందు, తారక = తరింప జేయునట్టి, తారక సంగర = తారకాసురుని యుద్ధము నందు, సంగ = కూడియున్న వారిచే (సైనికులచే), నుతే = కీర్తింపబడినదానా!, గజముఖ = వినాయకుని చేత, షణ్ముఖ = కుమార స్వామి చేత, రంజిత = అలరింపచేయబడిన, పార్శ్వ = ఇరుప్రక్కల చేత, సుశోభిత = ప్రకాశింపచేయబడిన, మానస కంజపుటే = మనస్సు అనెడు పద్మమును కలిగిన దానా!, మహిషాసురమర్దిని ! = మహిషాసురుని మర్దించినదానా !, జయజయ = నీకు జయమగుగాక !

## తాత్పర్యము

నీ సహజ తనూ కాంతితో జయింపబడిన సహస్రకిరణుడైన సూర్యుని చేత లేదా, నీచే జయింపబడిన కార్తవీర్యార్జునుని చేత వేయి చంద్రుల అందం కూడగట్టుకొన్న అందమైన, శ్రేష్ఠులైన వారి చేత లేదా చంద్రుని వంటి అందము గల ఒక వేయి మంది అందమైన శ్రేష్ఠులైన వారి చేత ఎడతెగకుండా స్తుతింపబడినదానా ! కుమారస్వామికి తారకాసురునికి మధ్య జరిగిన యుద్ధంలో - యుద్ధం చేసిన సైనికులచేత కీర్తించబడినదానా ! ఇరుప్రక్కల ఉన్న వినాయక కుమారస్వాముల చేత వికసింపబడి ప్రకాశింపబడిన హృదయ పద్మము గలదానా ! నీకు జయమగుగాక !

## విశేషాంశములు

**సహస్రకరైక సహస్ర సుధాకర రూప వరైక నుతే !** శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలో 'ఉద్యద్భాను సహస్రాభా' అనీ, 'భానుమండల మధ్యస్థా' అనీ అమ్మవారికి నామాలున్నాయి. ఉదయించే వెయ్యిసూర్యుల కాంతితో అమ్మవారు వుంటుందని, అసలు భానుమండల కాంతిపుంజాలకు ఉత్పత్తి కేంద్రంలాగా అమ్మవారు ఉంటుందని ఈ నామాలు చెప్తాయి. సౌందర్యలహరిలో గూడా ఇదే విధంగా అమ్మవారు "తిమిర మిహిర ద్వీపనగరి"గా 'అవిద్యానామంతస్తిమిర మిహిర ద్వీపనగరీ .....

వరాహస్యభవతి' అన్న 3వ శ్లోకంలో చెప్పబడుతుంది. సూర్యుడు అమ్మవారి చేత జయించబడ్డాడనే విషయం ఈ శ్లోక ప్రథమ పాదంలోని ప్రథమ పదంలోనే 'విజిత' అనే పదం ద్వారా సూచింపబడింది.

'సహస్రకరు'డంటే సూర్యుడనే కాకుండా 'కార్తవీర్యార్జునుడనే' అర్థం గూడా ఉంది. ఒకసారి కార్తవీర్యార్జునుడు గూడా అమ్మవారి చేతిలో ఓడిపోయాడు. అమ్మవారిని వేనోళ్ల స్తుతించి ముక్తుడయ్యాడు.

పైన తెల్పిన సూర్యుని చేత లేదా కార్తవీర్యార్జునుని చేతనే కాకుండా చంద్రుని లాంటి అందమైన వెయ్యి యువకుల చేత గూడా అమ్మవారు కొనియాడబడిందట ! దీనిని బట్టి అమ్మవారు ఎంత తేజస్సంపన్నురాలో ఎంతటి ఆహ్లాదకరమైన అందాలరాశియో అర్థమౌతుంది.

**కృత సుత తారక సంగర తారక తారక సంగర సంగనుతే !** కుమారస్వామికి - తారకాసురునికి జరిగిన యుద్ధంలో చాలా మంది సైనికులు యుద్ధంలో పాల్గొన్నారు. పాల్గొన్న సైనికులందరూ ఎంతో భక్తితో అమ్మవారిని స్తుతించి ముక్తి చెందారు. అంటే ఆ యుద్ధం దుష్టుల పాపాలకు ప్రాయశ్చిత్తంగా, శిష్టుల కష్టాలకు తారక మార్గంగా జరిగిందన్నమాట ! అమ్మ అనుగ్రహం వల్ల కుమారుడు సాధించిన విజయం ఇది.

**గజముఖ షణ్ముఖ రంజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే !** అమ్మవారి కిరుప్రక్కల గణేశ, కుమారులిరువురూ ఉండి మాతృవాత్సల్యాన్ని

చూరగొంటూ ఉంటారుట ! ఈ ఇద్దరూ బ్రహ్మాచారులే అని, అలా ఉండిపోవడానికి కారణం మాతృస్తన్య పానమహిమే అని శంకరులు సౌందర్యలహరిలో "సమందేవి స్కంద ద్విపవదన..... హస్తేన ఝటితి" అన్న 72వ శ్లోకంలో చెబుతారు.

అమ్మవారు ప్రకృతి స్వరూపిణి. సంవత్సర కాలంలో ఈ ప్రకృతి మాత వివిధ రకాల రూపాలు ధరిస్తుంది. ఈ సంవత్సర కాలంలోనే మేషాది ద్వాదశరాసుల్లో సూర్యుడు ప్రవేశిస్తూ నిష్క్రమిస్తూ వుంటాడు. అమ్మవారికి సంబంధించిన మాసం ఆశ్వయుజ మాసం. ఈ ఆశ్వయుజ మాసానికి ముందు వచ్చే మాసం భాద్రపదం. ఈ భాద్రపదమాసంలోనే గణేశ చతుర్థి వస్తుంది. ఆశ్వయుజం తర్వాత కార్తీకమాసం. ఈ మాసం కార్తికేయుడైన కుమారస్వామికి సంబంధించినది. రాశుల పరంగా చెప్పుకున్నా కన్యారాశి - గణేశునికి సంబంధించినది, తులారాశి అమ్మవారికి, వృశ్చికరాశి కుమారస్వామికి సంబంధించినవి. దీనిని బట్టి అమ్మవారికి ఇరువైపులా గణేశ కుమారులున్న సంగతి - భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసాల వరుసక్రమం, కన్య, తుల, వృశ్చికరాశుల వరుస క్రమం గూడా సూచిస్తాయి. ఈ విధమైన ఖగోళ, భూగోళ, జ్యోతి శ్శాస్త్ర సమన్వయం ఈ శ్లోకం 3వ పాదంలోని 'గజముఖ షణ్ముఖ రంజిత ... మానసకంజపుటే" అన్న సంబోధనలో ఉంది.

తులారాశి అనే ముత్యపు చిప్పకు ఇరువైపులా భాద్రపద కార్తీక మాసాలు "ముత్యపు చిప్పల్లా వుండి - మధ్యలో ఉన్న తులారాశిలో

'స్వాతి' ముత్యంలా అమ్మవారు వుంటుందన్నమాట ! (స్వాతి కార్తెలోని వర్షబిందువులు ముత్యపు చిప్పలో పడితేనే అవి ముత్యాలౌతాయి అని, ఈ స్వాతీ నక్షత్రం తులారాశిలోనిదే అన్న సంగతిని గూడా ఇక్కడ గుర్తు చేసుకోవాలి.)

**శ్లో॥ పదకమలం కమలానిలయే ! వరివస్యతి యో ఒనుదినం సశివే!**
**అయి కమలే ! విమలే ! కమలానిల శీకర సేవ్యముఖాబ్జ శివే!**
**తవ పదమద్య హి శివదం దృష్టి పథం గత మస్తుచ తస్య శివే!'**
**జయ జయ హే మహిషాసుర మర్దిని ! రమ్యకపర్దిని ! శైలసుతే. 18**

## అర్థము

కమలా నిలయే ! = కమలములందు నివసించుదానా !, సశివే! = శివునితో కూడిన దానా!, కమలే = లక్ష్మీ స్వరూపురాలా !, విమలే! = నిర్మలమైనదానా!, కమల + అనిల = కమలానిల = తామరపూలపై నుండి వచ్చు వాయువు యొక్క, శీకర = నీటి తుంపరల చేత, సేవ్య = సేవింపబడు, ముఖ + అబ్జ = ముఖాబ్జ = ముఖమనెడు పద్మము చేత, శివే = పవిత్రమైన దానా !, అయిశివే = ఓ శివానీ!, యః = ఎవడు, అనుదినం = ప్రతిరోజు, పదకమలం = నీ పాద పద్మమును, వరివస్యతి = ఉపాసించునో, తస్య = వానికి, శివదం = శుభమును కలిగించు నట్టి, తవపదం = నీ పాదము, అద్య = నేడు, దృష్టిపథం = దృక్పథమును, గతం + అస్తు = పొందుగాక!, రమ్యకపర్దిని = అందమైన జడలు

కలదానా !, శైలసుతే = ఓ పర్వతరాజపుత్రీ !, హే మహిషాసుర మర్దిని = మహిషాసురుని మర్దించిన దానా ! జయజయ = నీకు జయపరంపర అగుగాక !

## తాత్పర్యము

సకల సంపదలను ఇచ్చు కమలము నీ నివాసము. శివుని వామ భాగముగా నున్న మంగళ స్వరూపిణివి. లక్ష్మీ స్వరూపురాలవు. నిర్మలమైనదానవు. తామరపూలపై నుండి సాగివచ్చు గాలిలోని నీటి తుంపరలచే సేవింపబడు ముఖపద్మము గలదానవు. ఓ శివానీ ! శాంకరీ ! మహిషాసుర మర్దినీ ! నిత్యము ఎవడు నీ పాద పద్మమును ఉపాసించునో వానికి పరమ పావన పదమైన నీ పాదపద్మము ఎదురుగా సాక్షాత్కరించుగాక ! అందమైన జటలు గలదానా ! శైలపుత్రీ! నీకు జయమగు గాక !

## విశేషాంశములు

**కమలానిలయే ! :** బయట మనం చూసే కమలాలు సకల సంపత్ప్రదాలైతే - వెన్నెముకలోని సుషుమ్నానాడి వెంబడి ఉండే షట్కమలాలు సద్గతి ప్రదాలు. ఉపాసకుని కుండలినీ శక్తిని సహస్రార కమలంలోని శివునితో ఐక్యం చేసి ముక్తికి దోహదపడేవి కాబట్టే ఇవి సద్గతి ప్రదాలు. అంటే బాహ్య రంగంలోని కమలాలైనా, అంతరంగం

లోని కమలాలైనా సద్గతి ప్రదాలే నన్నమాట! అమ్మవారి పదస్పర్శ, సాన్నిధ్యాలే వాటికి అంతటి ప్రాముఖ్యాన్ని సంతరించి పెట్టాయి.

సశివే ! పతిని వీడని సతి అవడం చేత అమ్మవారు సతీపతుల మధ్య, అయిన వారి మధ్య ఎడబాటును సహించదు. మాలిన్యం లేని హేమ మాలిని, కాఠిన్యం లేని కాత్యాయని, పారాణి పాదాల పావని అవడం చేత - ఆమె సదనంలో లక్ష్మి, వదనంలో సరస్వతి కలసి వసిస్తాయి. అందుకే ఆవిడ చేతకు మాటకు తిరుగులేదు.

**కమలానిల శీకర సేవ్యముఖాబ్జ శివే!:** స్వచ్ఛమైన, నిర్మలమైన, నీరజాలపై నుండి వచ్చే నీటితుంపరలగాలి నిత్యము అమ్మవారి ముఖపద్మాన్ని స్పృశించి మరింత పవిత్రవంత మౌతుంది. అందుకే ఆమెను సోకిన గాలికిగూడా తరింపజేయగల పవిత్రత ఉంటుంది.

“పరమ పవిత్రమైన పార్వతీ పాదాలను భజించే వానికి - ఆ పాదదర్శనమై “జీవిత పథ నిర్దేశం జరుగుతుంది. జన్మ సార్థకతకు దారి ఏర్పడి ధన్యుడౌతాడు” అని ఆదిశంకరులు ఆశీర్వదిస్తూన్న విషయం శ్లోకంలోని “దృష్టి పథం గతమస్తు” అన్న పదాల్లో ఉంది.



## ఫలశ్రుతి

శ్లో. స్తుతిమితి స్తిమితస్తు సమాధినా
నియమతో యమతో௨నుదినం పఠేత్
పరమయా రమయా సతు సేవ్యతే
పరిజనో ௨పి జనో ௨పి చ తం భజేత్

## అర్థము

ఇతి = ఈ విధంగా, సమాధినా = ఏకాగ్రదీక్షతో, స్తిమితః = ప్రశాంతచిత్తుడై, నియమతః = నియమముతో, యమతః = నిగ్రహముతో, అనుదినం = ప్రతిరోజు, స్తుతిం = స్తోత్రమును, పఠేత్ = చదువవలెను, సః = ఆ విధముగా చేయువాడు, పరమయా = ఉన్నతాధిక్యమైన, రమయా = సుఖ సంపదలచేత, సేవ్యతే = సేవింపబడును, చ = మరియు, జనః అపి = సామాన్యుడైనను, పరిజనః అపి = పరిచారకుడైనను, తం = సంపదను, భజేత్ = పొందును.

## తాత్పర్యము

ఎవడు దీక్షగా నియమనిష్ఠలతో ఏకాగ్రచిత్తుడై బాహ్య అంతరేంద్రియ నిగ్రహముతో నిత్యము ఈ మహిషాసురమర్దినీ స్తోత్రమును పఠించునో వానికి సకల సంపదలు, సౌఖ్యములు కలుగును. వాడు సామాన్యుడైనను, పరిచారకుడైనను పదవీ సంపదలతో నిత్యము సౌఖ్యములందుకొనును.